# Ishq mera mazhab hai. Rasna Mera Drink Hai.



Yesterday at my school drama, I was like Amitabh Bachchan as in 'Khuda Gawah'. And everyone clapped and applauded. And when I came home you know what Mummy asked? 'So little Ustaad, what do you want to drink?' You know what I said? 'Ishq mera mazhab hai, Rasna Mera Drink Hai.' And then I drank up the whole jug of pyaara Rasna...







I Love You Rasna

More Taste — More Fun

Mudra: EAMR: 6641



# చందమామ

మే 1993



ఈ సంచికలో కథలు-వింతలు-విశేషాలు






విడి ప్రతి : 4.00
సంవత్సర చందా : 48.00




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి

## పౌరవిద్య ఆవశ్యకత!

ఫ్రాన్స్ దేశంలో లక్షలాది మంది బాల బాలికలు కొన్ని నెలల క్రితం, ఒకరోజు పాఠశాలలకు పుస్తకాలతోపాటు తలా కొంచెం బియ్యం కూడా పట్టుకుపోయారు. ఆ రోజు అందరూ తీసుకువెళ్ళిన బియ్యం 4,300 టన్నులయింది! అలా పోగయిన బియ్యాన్నీ, ధనాన్నీ వాళ్ళు సోమాలియాలో ఆకలితో అలమటిస్తూన్న పిల్లలకు పంపారు!

ఆఫ్రికాలోని సోమాలియాలో పధ్నాలుగు గెరిల్లా గ్రూపులకు మధ్య దాదాపు ఒక సంవత్సరానికి పైగా జరుగుతున్న యుద్ధం కారణంగా వేలాది మంది ప్రజలు ప్రాణాలు కోల్పోయారు. ఇంకా కొందరు ఇల్లూ, వాకిలీ వదిలి పొరుగు దేశమైన ఎథియోపియాకు పారిపోయారు. మిగిలినవారు దారుణమైన ఆకలిచావులకు గురికావలసివచ్చిన దయనీయ దుస్థితి గురించి అందరికీ తెలిసినదే.

ఆకలితో అలమటిస్తున్న సోమాలియా ప్రజలకు సహాయపడడానికి ప్రపంచంలోని అనేక దేశాలు ముందుకు వచ్చాయి. వివిధ గెరిల్లా గ్రూపుల మధ్య శాంతి నెలకొల్పడానికి ఐక్యరాజ్య సమితి ప్రయత్నిస్తున్నది. 'ఐక్యరాజ్య సమితి బాలల నిధి' సోమాలియా బాలలను కాపాడడానికి పదివేల టన్నుల బియ్యం సేకరణకు పూనుకుని ప్రపంచ దేశాలకు పిలుపు నిచ్చింది. ఆ పిలుపును అందుకుని ఫ్రాన్స్ బాలబాలికలు 4,300 టన్నుల బియ్యం పోగుచేసి తమవంతు కర్తవ్యాన్ని నిర్వహించారు. "పౌరవిద్యవల్ల ఏర్పడిన మహత్తర పరిణామం ఇది. మానవాళి మంచి చెడ్డలలో పిల్లలందరూ కూడా ఉమ్మడి బాధ్యత వహించే విధంగా చేయడానికి ఇది దోహదం చేస్తుంది," అన్నాడు ఫ్రాన్స్ మానవ వనరుల మంత్రి బెర్నార్డ్ కోచ్నర్.

ఫ్రాన్స్ దేశపు పిల్లలలాగే, మన బాల బాలికలు కూడా తమ కర్తవ్యాలను నిర్వహించ వలసిన పరిస్థితులూ, అవకాశాలూ చాలా ఉన్నాయి. అయితే, అందుకు అవసరమైన పౌరవిద్యనూ, సాటి మానవులపట్ల ప్రేమనూ, మనం పిల్లలకు నేర్పుతున్నామా? అన్నదే ప్రశ్న!

పిల్లలలో అటువంటి ఆరోగ్యకరమైన మనస్తత్వాన్ని పెంపొందించవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. వేసవి సెలవులు ఆరంభమయిన ఈ తరుణంలో- ఫ్రాన్స్ విద్యార్థులను ఆదర్శంగా తీసుకుని మన విద్యార్థులు కూడా బాధలలో ఉన్న వారికి చేతనైన సాయం చేయడానికి ప్రయత్నించగలరని ఆశిస్తున్నాము.

సంపుటి 91 మే '93 సంచిక : 5

విడిప్రతి : 4.00 సంవత్సర చందా : 48.00







మీరు చదువుతున్నారా?

26 సంవత్సరాలకు పైగా
సినీ పరిశ్రమకు
ప్రేక్షక పాఠకులకు మధ్య వారధిగా
నిలిచి, ఇటు పరిశ్రమలోనూ,
అటు ప్రేక్షకులలోనూ
ఉత్తమాభిరుచులను
పెంపొందించడంలో
కృషిచేస్తున్న




ఏకైక మాసపత్రిక

# విజయచిత్ర



వార్తలు - విశేషాలు:

# ఆరవసారి అధ్యక్ష పదవి!



ఏ రాజకీయ నాయకుడికైనా సరే వరుసగా ఆరు సార్లు ఒక దేశానికి అధ్యక్షుడు కావడం అన్నది సాధారణమైన విషయం కాదు. ఇండొనేషియా అధ్యక్షుడు జనరల్ సుహార్తోకు ఆ గౌరవం లభించింది. ఇండొనేషియా రాజధాని జకార్తాలో గత మార్చ్ నెలలో పదిరోజులపాటు జరిగిన 1000 మంది సభ్యులు గల 'పీపుల్స్ కన్సల్టేటివ్ అసెంబ్లీ' సమావేశంలో 72 సంవత్సరాలు నిండిన జనరల్ సుహార్తోను అధ్యక్ష పదవికి ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు.

16వ శతాబ్దంలో దాదాపు 13,000 ద్వీపాల సమూహమైన ఇండొనేషియాలో పోర్చుగీసు వ్యాపారులు వలస వెళ్ళి స్థిర పడడంతో ప్రపంచ చరిత్రలో దానికి స్థానం ఏర్పడింది. అక్కడ విరివిగా పండే సుగంధ ద్రవ్యాలు వారిని ఆకర్షించాయి. అయితే వారిని అక్కడి నుంచి ఇంగ్లీషు వ్యాపారులు తరుమ గొట్టారు. 1595వ సంవత్సరంలో డచ్ వ్యాపారులు ఇంగ్లీషు వారిని తరుమగొట్టారు. ఆ తరవాత దాదాపు 200 సంవత్సరాలు ఆ ద్వీప సముదాయం డచ్ ఈస్ట్ ఇండియా కంపెనీ పాలనలో ఉన్నది. 1768వ సం॥లో అది నెదర్లాండ్స్ పాలిత ప్రాంతం అయింది. రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో (1939-45) దానిని జపాను ఆక్రమించుకుని 1942వ సం॥లో తన నాయకత్వంలో జాతీయ ప్రభుత్వం ఏర్పాటు చేసింది. అయితే, 1945వ సం॥లో జపాన్ మిత్ర పక్షాలకు లొంగిపోగానే, సుకర్నో నాయకత్వంలో జాతీయవాదులు స్వతంత్రం ప్రకటించుకున్నారు. 1949వ సం॥లో అది డచ్ నుంచి లాంఛనప్రాయంగా విడుదల పొంది స్వతంత్ర దేశమయింది.1963వ సం॥లో నెదర్లాండ్స్ కూడా పశ్చిమ న్యూగెనియాను వదులుకున్నది. 1966వ సం॥లో సుకర్నోకు వ్యతిరేకంగా కమ్యూనిస్టు తిరుగుబాటు జరిగింది. ఆ తిరుగు బాటును జనరల్ రాడెన్ సుహార్తో అణచివేసి, అత్యవసరపరిస్థితిని ప్రకటించాడు. 1967వ సం॥లో ఆయన సుకర్నో స్థానంలోకి వచ్చాడు. ఆ తరవాత 1968, 1973, 1978, 1983, 1988వ సంవత్సరాలలో అయనే ఆ పదవికి ఎన్నికయ్యాడు. ఇప్పుడు ఆరవసారి అధ్యక్షుడయ్యాడు!

వట్టి మాటలకన్నా, గట్టి చేతలలో తన సామర్థ్యాన్ని నిరూపించుకున్న నాయకుడు ప్రెసిడెంట్ సుహార్తో. పాతికేళ్ళుగా ఆయన ప్రవేశపెట్టిన పథకాలు ఇండొనేషియా ఆర్థిక రంగ అభివృద్ధికి దోహదం చేశాయి. ముఖ్యంగా పంచవర్ష ప్రణాళికలు ఇతర దేశాల దృష్టిని కూడా

ఆకర్షించాయి. వాటి ద్వారా యేటా ఆరు శాతం ఆర్థికాభివృద్ధిని సాధించి ఇండొనేషియా ప్రపంచంలో సత్వర అభివృద్ధి సాధించిన పది వర్ధమాన దేశాలలో ఒకటి అయింది.

ఒకప్పుడు ఇండొనేషియా ఇతర దేశాల నుంచి బియ్యాన్ని ఎక్కువగా దిగుమతి చేసుకునేది. అది 1984వ సంవత్సరంలో స్వయం పోషకత్వాన్ని సాధించింది. ఇరవై యేళ్ళలో శిశుమరణాల సంఖ్య వెయ్యికి 140 నుంచి 60కి తగ్గింది. పిల్లలందరూ బడులకు వెళుతున్నారు. 1971వ సంవత్సరంలో 39 శాతం ఉన్న నిరక్షరాస్యత ఇప్పుడు 16 శాతానికి తగ్గింది. జనాభా పెరుగుదల 2.3 శాతం నుంచి 1.6 శాతం వరకు అరికట్టబడింది. అందువల్ల ప్రెసిడెంట్ సుహార్తోను ఇండొనేషియా అభివృద్ధినేతగా చెప్పుకుంటారు. రానున్న ఇరవై అయిదు సంవత్సరాలలో సాధించవలసిన వాటికి ఆయన అప్పుడే పథకాలు రూపొందించాడు.




ప్రస్తుతం ఇండొనేషియా ప్రజల మధ్య-- ప్రెసిడెంట్ సుహార్తో ఈ ఐదేళ్ళు పూర్తిగా పదవీబాధ్యలు నిర్వహించగలడా లేక వారసుడి కోసం అన్వేషిస్తున్నాడా అన్న విషయం ప్రధాన చర్చనీయాంశంగా ఉంటున్నది.

**ఇండొనేషియా గురించిన మరికొన్ని విశేషాలు:**

- 13,500 ద్వీపసముదాయమైన ఇండొనేషియా 5,510 కి.మీ. దూరం వ్యాపించి ఉన్నది. ఈ ద్వీపాలు కొన్ని, హిందూమహాసముద్రంలోనూ మరికొన్ని పసిఫిక్ మహాసముద్రంలోనూ ఉన్నాయి.
- ఇండొనేషియా ప్రపంచంలో 16వ పెద్ద దేశం (1,919,450 చ.కి.మీ.) జనాభాలో 5వ స్థానం వహిస్తున్నది (16,90,00000).
- సైనికబలంలో 11వ అతిశక్తివంతమైన దేశం; కెనడాకు తరవాత ఇండొనేషియా వస్తుంది.
- సత్వర అభివృద్ధి సాధిస్తూన్న దేశాలలో ఐదవది.
- వరి పంట పండించడంలో ప్రపంచంలో మూడవస్థానం వహిస్తున్నది.
- ఇక్కడి అధికార భాష ఇంగ్లీషు లిపిలోని 'బహాసా ఇండొనేషియా'. ఇది కాకుండా దాదాపు 200 ప్రాంతీయ భాషలు మాట్లాడే ప్రజలు ఉన్నారు.
- వాడుకలో ఉన్న కరెన్సీ 'రుపియా'.



# గ్రహణం విడిచింది!

సర్వేశ్వరపురం జమీందారుగారి పనిమీద బయలుదేరిన శౌరి అనే యువకుడు, అనుకున్నట్టుగానే చీకటిపడే సమయానికి, మార్గమధ్యంలోవున్నచిట్టడవిదాటగలిగాడు. అయితే, అంతలో ఆకాశంలో మేఘాలు కమ్మి జడివాన ప్రారంభమైంది.

శౌరి ఇక ఆ రాత్రికి ప్రయాణం మాని, ఎక్కడో ఒక చోట తలదాచుకోక తప్పదను కుంటూండగా, మెరుపుల కాంతిలో కొన్ని ఇళ్ళు కనిపించాయి. శౌరి గబగబా వాటికేసి పరిగెత్తి, ఒక పాతకాలపు పెంకుటింటి తలుపు తట్టాడు.

వెంటనే ఒక ముసలాయన చేతిలో ఒక చిన్నదీపంతో తలుపు తెరిచాడు. ఆయనకు ఒక కాలు కుంటి. శౌరిని చూస్తూనే, "లోప లికిరా! తడిసి పోలేదు కదా?" అన్నాడు.

లేదన్నట్టు తల ఊపి, శౌరి లోపలికి వెళ్ళాడు. ముసలాయన, శౌరికి అక్కడున్న మంచం చూపి కూర్చోమని, "ఈ చీకట్లో, జడివానలో ఎక్కడికి పోతున్నావు?" అని అడిగాడు.

శౌరి కొంత అయిష్టంగానే, "నేను సర్వే శ్వరపురం జమీందారుగారి దివాణం కాపలా భటుణ్ణి. జమీందారుగారి చిన్నకొడుక్కు మేనమామగారి ఇంటి నుంచి, ఒక పిల్లి పిల్లను తెచ్చేందుకు బయలుదేరాను. అదేదో కొత్త జాతిదట! ఆ పిల్లి పిల్లను తేనిదే, తను అన్నం ముట్టనని చినబాబు మారాం చేస్తున్నాడు," అన్నాడు.

ఇది విని ముసలాయన పెద్దగా నవ్వి, "నీకు పట్టుమని పాతికేళ్ళున్నట్టు కూడా లేదు. ఆరడుగుల యువకుడివి. డాలూ, కత్తీ పట్టి రాజ్యరక్షణకూ, రాజుగారి రక్షణకూ ముందుకురకవలసిన నువ్వు, జమీందార్ల దివాణాలకు పిల్లికూనల్నీ, కుక్కపిల్లల్నీ మోసుకుపోతున్నావన్నమాట!" అన్నాడు.

మాచిరాజు కామేశ్వరరావు



నంద! ఆమె కాబోయే భర్త ఈ రాజ్యానికి రాజు కాగలడు. ఇప్పుడామె తానడిగిన మూడు వేర్వేరు ప్రశ్నలకు, ఒకే సంతృప్తి కరమైన సమాధానం చెప్పిన వారిని వివాహమాడతానని ప్రకటించింది. సరి అయిన సమాధానం చెప్పలేని అమాయకు లను కిరాతకంగా మొసళ్ళకు ఆహారంగా వేయిస్తున్నది," అన్నాడు.

"ఈ విషయాలు మీకెలా తెలుసు?" అంటూ ఆశ్చర్యపోయాడు శౌరి.

"నేను రాజుగారి అంగరక్షకుడుగా పదిహే నేళ్ళు పనిచేశాను. ఒక రథం ప్రమాదంలో రాజుగారిని రక్షించబోయి కాలువిరగ్గొట్టు కున్నాను. సొంత ఊరి మీది మమకారంతో చివరి రోజులు ఇక్కడ గడుపుతున్నాను. అయినా, రాజుగారి అంతఃపుర విషయాలు ఎప్పటికప్పుడు తెలియపరిచే మనుషులు నాకున్నారు. నువ్వు, ఈ పెళ్లిపిల్ల వ్యవ హారం పక్కన పెట్టి, రాజధానికి వెళ్ళు. సాహసించి, రాకుమారి దుష్కార్యాలను అరికట్టు," అన్నాడు ముసలాయన.

ముసలాయన నవ్వుతూనే అన్న ఆ కటు వైన మాటలకు, శౌరి గతుక్కుమన్నాడు. అయితే, ముసలాయన ఆప్యాయంగా అతడి భుజం తట్టి, "సరే, మాసం క్రితం ఈ రాజ్యంలో జరిగిన దారుణం గురించి నీకు తెలుసా?" అని అడిగాడు.

"తెలుసు. రాజుగారు సముద్ర విహారా నికి వెళ్ళి, పడవ ప్రమాదంలో మరణించ డానికి మించిన దారుణం ఏముంటుంది!" అన్నాడు శౌరి బాధగా.

ముసలాయన ఒకటి, రెండు క్షణాలు తలపంకిస్తూ వూరుకుని, "సరే, నీకు అంతకు మించి తెలియదన్నమాట! విను. రాజుగారి ఏకైక సంతానం రాకుమారి అలక

శౌరి కొంచెంసేపు తలవంచుకుని ఊరు కుని, "అయ్యా! తమరు ఆశీర్వదిస్తే అలాగే రాజధానికి వెళతాను," అన్నాడు.

"ఆహాఁ, మెచ్చాను!" అంటూ ముసలా యన, శౌరి తల నిమిరాడు.

మర్నాడు శౌరి ప్రయాణం రాజధాని దిశగా మారింది. అతడు సాయంత్రానికి



అంతఃపుర భవనం చేరుకుని, రాజకుమారి అడిగే ప్రశ్నలకు జవాబు చెప్పడానికి వచ్చానన్నాడు.

"సరయిన జవాబు చెప్పలేకపోతే జరిగేదేమిటో తెలుసా?" అన్నది రాకుమారి పరిచారిక.

"చావు! మొసళ్ళకాహారం," అన్నాడు శౌరి నిర్భయంగా.

అప్పుడు ఇద్దరు పరిచారికలు, శౌరి కళ్ళకు గంతలు కట్టి నడిపించుకుపోయి, ఒక గదిలో వదిలి, "ఇక గంతలు విప్పేసుకో!" అన్నారు.

శౌరి అలాగే చేశాడు. అతడికి ఎదురుగా సింహాసనం మీద కూర్చుని వున్న రాజకుమారి అలకనంద కనిపించింది. ఆమె అద్భుత సౌందర్యవతే కాని, ముఖంలో విచారం గూడుకట్టుకుని వున్నట్టు కనిపించింది.

"ఆకాశంకన్నా చాలా విశాలమైనది ఏది? సముద్రంకన్నా లోతైనది ఏది? వెన్నకన్నా మెత్తనైనది ఏది? ఈ మూడు ప్రశ్నలకూ ఒకే సమాధానం కావాలి!" అన్నది అలకనంద నిరాసక్తంగా.

శౌరి ఆశ్చర్యంగా ఆమెకేసి చూస్తూ, "స్త్రీ హృదయం! అయినా, ఇవేం ప్రశ్నలు రాకుమారీ? ఇవి ఏనాడో, లోకజ్ఞానంలేని కేవల భావుకులు, తమకు తామై ప్రశ్నలూ, జవాబులూ కూడా తయారు చేసుకున్నవి. పరీక్షించాలంటే కఠినమైన ప్రశ్నలు నీ మనస్సుకు స్ఫురించలేదా?" అని అడిగాడు.

అలకనంద ఎంతో విచారంగా, "నేను స్వతంత్రురాలినైతే, ఈ ప్రశ్నలు నిన్నడిగే దాన్ని కాదు. ఒక దుష్టుడు నా చేత ఈ ప్రశ్నలు వేయించి, ఎలాంటి జవాబిచ్చిన వాళ్ళనైనా సరే మొసళ్ళకు ఆహారంగా వేయిస్తున్నాడు. నువ్వూ మొసళ్ళకు ఆహారం కాక తప్పదు!" అన్నది.

ఆ వెంటనే శౌరి కుడి చేయి పైకెత్తి పిడికిలి బిగించి, "రాకుమారీ! ఆ దుష్టుడెవరో చెప్పండి. వాడెంతటి శక్తిమంతుడైనా సరే, ఈ క్షణమే సంహరించగలను," అన్నాడు.



వెళ్ళారు. వీరవర్మ అక్కడ ఒక ఎర్రరాతి కొండగుహలో రాజును బంధించి, అలకనందను రాజాంతఃపురానికి తీసుకు వచ్చాడు. తర్వాత సముద్రంలో ప్రమాదవశాత్తూ పడవ మునిగిపోయిందనీ, రాజుగారి జాడ తెలియలేదనీ, రాకుమారిని మాత్రం రక్షించి తీసుకు వచ్చాననీ, ఒక కట్టుకథ అల్లి చాటింపు వేయించాడు. ఇప్పుడు వాడు ప్రశ్నల పథకంతో, జవాబు చెప్పవచ్చిన వాళ్ళను మొసళ్ళకు ఆహారంగా వేస్తూ — చివరకు రాకుమారి ప్రశ్నలకు తనే తగిన జవాబివ్వడంతో, ఆమె తనను వరించిందని వివాహమాడజూస్తున్నాడు.

"నువ్వు సమర్థుడివీ, తెలివైన వాడివీలా వున్నావు. ఆ దుష్టుడి విషయంలో ఇప్పటికే చాలా ఆలస్యమైపోయింది. ఇంకొక్క రోజు మాత్రమే మిగిలి వుంది," అని రాకుమారి అలకనంద, తనూ, రాజూ ఎలాంటి విపత్కర స్థితిలో వున్నదీ వివరించింది:

నెలరోజుల క్రితం అలకనంద, తండ్రితో పాటు సముద్ర విహారానికి వెళ్ళింది. ఆ సమయంలో సేనాధిపతి వీరవర్మ కూడా వాళ్ళ వెంట వున్నాడు. వాడు దురుద్దేశంతో తమ వెంట వచ్చినట్టు వాళ్ళు, సముద్ర మధ్యంలో తెలుసుకున్నారు. పడవ నడిపే వాళ్ళందరూ వాడి మనుషులే. వాళ్ళు పడవను ఒక చిన్న ద్వీపం దగ్గిరకు తీసుకు

ఇంత చెప్పి అలకనంద, "క్రితం రాత్రి నిద్రపట్టక నేను ఉద్యానవనంలోకి వెళ్ళాను. అక్కడ సేనాధిపతీ, వాడి నమ్మినబంటయిన నాగేంద్రుడూ మధ్య జరుగుతున్న సంభాషణ, ఒక పొద చాటున నిలబడి విన్నాను.

సేనాధిపతి, నాగేంద్రుడితో, 'రేపు ఉదయానే నువ్వు ద్వీపంలోని ఎర్రరాతి కొండ దగ్గిరకు పో. అక్కడ కాపలావున్న వాళ్ళతో 'గ్రహణం విడిచింది!' అన్న సంకేత పదం చెబితే, వాళ్ళు రాజును నీతోపాటు పంపుతారు. మీ పడవ సముద్రమధ్యంలో వుండగా, అతణ్ణి పట్టి సముద్రజలం లోకి తోసెయ్యి. ఎల్లుండి గొప్ప శుభదినం. రాకుమారితో నా పెళ్ళి ఆరోజే. ఆ తర్వాత

నేను రాజునయ్యాక, ఇంత నమ్మకంగా నాకు సాయపడిన నీకు సేనాధిపతి పదవో, మంత్రి పదవో ఇస్తాను,' అన్నాడు," అన్నది.

"ఇంతటి రాజద్రోహులుంటారని, నేనే నాడూ వినలేదు,రాకుమారీ!"అన్నాడు శౌరి పట్టరాని కోపంతో.

"ఆ వీరవర్మ నరరూపరాక్షసుడు! వాడు చీకటిపడే వేళకు, నిన్ను మొసళ్ళకు ఆహారంగా వేయడానికి వస్తాడు. నీ జవాబు నచ్చలేదని చెప్పగానే, నువ్వు గవాక్షం గుండా దూకి పారిపోయావని వాడికి చెబుతాను," అన్నది అలకనంద.

ఆ వెంటనే శౌరి గవాక్షం గుండా బయటికి దూకి, చెట్ల చాటున నక్కుతూ పోయి ఉద్యానవనం చేరి, అక్కడి నుంచి సముద్రతీరం చేరాడు.

మర్నాడు శౌరి, తూర్పు తెల్లవారు తూండగానే ఒక బెస్తవాడికి కొంత డబ్బిచ్చి, రాజు బంధితుడైవున్న ద్వీపం చేరాడు.

శౌరి ద్వీపంలో కాలు పెట్టగానే, తలకు మూడింతలున్న తలపాగా ధరించిన వాడొకడు, కత్తిదూసి మీసం మెలితిప్పుతూ శౌరికి అడ్డువచ్చి, "ఎవడివిరా నువ్వు? ఏమైనా సముద్రపు దొంగల ముఠాలోనివాడివా?" అని గద్దిస్తూ అడిగాడు.

శౌరి వాణ్ణి సమీపించి ఏ మాత్రం తొణక్కుండా పెద్ద గొంతుతో, "గ్రహణం విడిచింది!" అన్నాడు.



అది విని తలపాగా వాడు ఒక్క క్షణం నివ్వెరపోయి,"ఏమిటీ! ఈ సంకేతం నాకూ, నాగేంద్రంగాడికీ తప్ప షరెవడికీ తెలియదే?" అన్నాడు.

శౌరి మరింత పెద్దగొంతుతో, "ఇక్కడికి వచ్చేటప్పుడు సముద్రంలో నా డాల్, కత్తులు జారవిడుచుకున్నాను. లేకపోతే ఈ క్షణమే నీ తలను మొండెం నుంచి వేరు చేసేవాణ్ణి. ఆయన నాగేంద్రంగాడు కాదు, నాగేంద్రసింహుడు, కానున్న మహారాజు!" అన్నాడు.

తలపాగావాడు వెలవెలపోతూ, "ఏమిటేమిటీ! విడ్డూరంగా ఉన్నదే! కాస్త విడమరిచి చెప్పు," అన్నాడు.

"అయితే, విను. రాత్రి నాగేంద్రసింహుల వారు, సేనాధిపతి వీరవర్మ భోజనంలో ద్వాదశ విషాల లేహ్యం కలిపారు. అది పన్నెండు గంటల తర్వాత, తన శక్తి చూపు తుంది. ఆ విధంగా సేనాధిపతి పరలోక యాత్ర కట్టగానే, నాగేంద్రసింహులవారు, ఈ ద్వీపానికి వచ్చి, రాజును విడిపించి..." అంటూ శౌరి చెబుతూండగానే, తలపాగా వాడు పెద్దగా వాంతి చేసుకుని నేలమీద పడిపోయాడు.

వెంటనే శౌరి, వాడి కత్తి తీసుకుని పడవలో వున్న తాళ్ళతో వాణ్ణి బంధించి, దూరంగా వున్న కాపలావాళ్ళతో, "మహా రాజుగారిని తక్షణం ఇక్కడికి తీసుకు రండి!" అని కత్తి ఝళిపించాడు.

కాపలావాళ్ళు రాజును బంధవిముక్తుణ్ణి చేసి అక్కడికి తీసుకువచ్చారు.

తిరుగుప్రయాణంలో రాజు— స్పృహ వచ్చినా, ఇంకా విష ప్రయోగ భయంతో గజగజవణికి పోతున్న సేనాధిపతి వీర వర్మను, శౌరికి చూపుతూ, "ఈ రాజద్రోహి వీరవర్మ అని ఎలా గ్రహించావు?" అని అడిగాడు.

అందుకు శౌరి, "మహారాజా! నేను యువ రాణి భవనం నుంచి తప్పించుకు పోయా నని తెలియగానే, నాకు కొన్ని రహస్యాలు తెలిసివుంటవన్న అనుమానంతో వీడు ద్వీపానికి వస్తాడని ఊహించాను. అంతే కాక, నేను సంకేత పదం చెప్పగానే—ఈ సంకేతం నాకూ, నాగేంద్రంగాడికీ తప్ప మరెవరికీ తెలియదే! అన్నాడు. దానితో వీడే రాజద్రోహి అని గ్రహించి, విషప్రయోగం కట్టుకథ చెప్పాను. వీడు విష ప్రయోగం జరగక పోయినా, జరిగిందన్న భయం కొద్దీ స్పృహ పోగొట్టుకున్నాడు," అన్నాడు.

రాజు, శౌరిని మెచ్చుకుని, మర్నాడు నిండుసభలో జరిగిందంతా చెప్పి, "ఈ శౌరి సాహసం కారణంగా, ఈ రాజ్యానికి పట్టిన గ్రహణం విడిచింది. ఇతడే యువరాణి భర్త, కాబోయే రాజు!" అన్నాడు.

సభికులు తమ ఆమోదం ప్రకటిస్తూ హర్షధ్వానాలు చేశారు.






# 2

[మాణిక్యపురిలో జరిగిన వసంతోత్సవాల సందర్భంగా ఏర్పాటు చేసిన పోటీలలో పాల్గొన్న ఉత్తుంగుడనే కొండజాతి యువకుడు యువరాణి ప్రియంవదకు ఒక పుష్పగుచ్ఛాన్ని ఇచ్చాడు. యువరాణి కోరిక ప్రకారం, రాజు ప్రతాపవర్మ ఆ పువ్వులు పూచే మొక్కలను తెమ్మని భటులను పంపాడు. వాళ్ళు పువ్వులతో మాత్రం తిరిగి వచ్చారు. రాజగురువు గౌరీనాధుడు ఆ పువ్వులు అశుభసూచకాలని రాజుకు చెప్పాడు.— తరవాత]

"అంతటి అందమైన పరిమళ పుష్పాలు అశుభాన్ని ఎందుకు సూచిస్తాయి? అవి పూయడం అశుభం ఎలా అవుతుంది? అర్థం కావడం లేదు, గురుదేవా!" అన్నాడు రాజు ప్రతాపవర్మ.

"ఆ విషయం తరవాత చెబుతాను. ఆ పుష్పాలను సైనికులు ఇద్దరు తీసుకువచ్చినట్టు విన్నాను. సైనికులు ఎందుకు అవి పూచే ఈశాన్య సరిహద్దులకు వెళ్ళారు? అక్కడ కలహాలు చెలరేగ లేదు కదా?" అని అడిగాడు రాజగురువు గౌరీనాధుడు.

"లేదు, గురుదేవా! తమ ఆశీర్వాద బలంతో దేశమంతటా ప్రజలు సుఖశాంతులతో క్షేమంగా ఉన్నారు!" అని రాజు 'శతాబ్దిక' గురించి సైనికులు చెప్పిన విషయాలను క్లుప్తంగా తెలియజెప్పాడు. అంతా విన్న రాజగురువు, "ఇప్పుడా పుష్పాలు ఎక్కడ ఉన్నాయి?" అని అడిగాడు.



"యువరాణి భవనంలో ఉన్నాయి. ఇన్ని రోజులు అయినప్పటికీ అవి వాడకుండా ఇంకా పరిమళాలు విరజిమ్ముతూనే ఉన్నాయి!" అన్నాడు రాజు.

"వాటిని వెంటనే అక్కడి నుంచి తొలగించండి. అవి రాజభవనంలో ఉన్నట్టయితే, రాజకుటుంబానికి అరిష్టదాయకం అని యువరాణికి నామాటగా తెలియజేయండి," అన్నాడు రాజగురువు.

"మీ ఆజ్ఞను శిరసావహిస్తాను, గురుదేవా!" అని రాజు ఒక్క క్షణం మౌనం వహించి, "అయితే, ఆ పుష్పాలు ఎందుకు అశుభ సూచకాలని తమరు భావిస్తున్నారో చెబితేవినాలనిఉన్నది. యువరాణి ప్రియంవద ఆ పువ్వులను ప్రాణ సమానంగా భావిస్తున్నది. కాబట్టి వాటిని గురించిన అసలు సంగతులు ఆమెవినడం శ్రేయస్కరమని భావిస్తున్నాను. పిలువమంటారా?" అని అడిగాడు.

సరే అన్నట్టు తలపంకించాడు రాజగురువు.

యువరాణి రాగానే ఆమె రాజగురువుకు పాదాభివందనం చేసింది. రాజగురువు ఆమెను ఆశీర్వదించి, కూర్చోమని పక్కనున్న ఆసనాన్ని చూపాడు.

ఆమె కూర్చున్న తరవాత, తనను పిలిచిన కారణం ఏమిటి? అన్నట్టు తండ్రిని చూసింది.

" 'శతాబ్దిక' అనే ఆ విచిత్ర పుష్పాలను గురించి కొన్ని ముఖ్యమైన విషయాలను తెలియజేయడానికి రాజగురువు వచ్చారు. ఆయన చెప్పే విషయాలు నీకు తెలియడం అవసరం. కాబట్టి, నిన్నూ రమ్మన్నాను," అన్నాడు రాజు కుమార్తెతో.

"అలాగా!" అన్నట్టు ఆమె రాజగురువు కేసి చూసింది.

రాజగురువు కొంతసేపు మౌనంగా ఆలోచిస్తూ గడిపి, ఆతరవాత ఇలా చెప్పసాగాడు:

"ఒకానొకప్పుడు వింత పరిమళాలు విరజిమ్మే ఈ విచిత్ర పుష్పాలు, అన్ని పువ్వుల లాగే ఏడాదికొకసారి పూచేవి. ఒక్కసారి పూచాయంటే రోజుల తరబడి వాడకుండా ఉండేవి. కొన్ని వందల సంవత్సరాలకు

పూర్వం మీ వంశానికి చెందిన చంద్ర కాంతుడు అనేరాజు మాణిక్యపురి రాజ్యాన్ని పరిపాలించాడు. ఆయన ధర్మప్రభువుగా, సాహస వీరుడుగా పేరు గాంచాడు. ఆయ నకు చంద్రకేతు అనే సోదరుడు ఉండే వాడు. వాడు అన్ని విధాలా అన్నకు విరుద్ధ మైనవాడు. రాజ్యనిర్వహణాభారంలో అన్నకు సాయపడడం మాని, హాని చేయడానికి పూనుకున్నాడు. వాడు దేశదిమ్మరి అయి ఊరూరా తిరిగి ఆఖరికి, రాజ్యానికి ఉత్తర సరిహద్దులలో వున్న కొండ ప్రాంతాన్ని చేరాడు. అక్కడ అతడు కొండజాతి ప్రజ లతో పరిచయం చేసుకున్నాడు. వారిలో నాగాంబి అనే వాడికి మంత్ర తంత్రాలు తెలుసు. వాడితో స్నేహం చేసి వాడి నుంచి కొన్ని తంత్ర విద్యలు నేర్చుకున్నాడు చంద్ర కేతు. ఒకనాడు ఆ కోయవాడు విచిత్రమైన కొన్ని పువ్వులను కోసి, సలసల మరుగు తున్న నీళ్ళలో వేయడం చూశాడు. కోయ వాడు ఆ నీళ్ళను రోజూ కొంతసేపు మళ్ళీ మళ్ళీ కాచి ఒక విధమైన సువాసనతో ఉన్న తైలం తీశాడు. ఆ తైలాన్ని ఎవరి పైనైనా చల్లినట్టయితే, వాళ్ళు తమకు వశమై, తాము చెప్పినట్టు నడుచుకుంటారని కోయవాడు చంద్రకేతుకు చెప్పాడు. చంద్ర కేతు అమితోత్సాహంతో ఆ పువ్వులను తీసు కుని మాణిక్యపురి చేరి, ఒక రహస్య ప్రదేశంలో కోయవాడు చేసినట్టు ఆ పువ్వు



లను నీళ్ళలో వేసి కాచి, మరి కొన్నాళ్ళకు విచిత్రపుష్పతైలం తయారుచేశాడు. మొదట ఆ తైలాన్ని ఎవరైనా మామూలు మనుషుల మీద వాడి, వారి ప్రవర్తనను రూఢి చేసు కుని, ఆ తరవాత దానిని రాజు మీద ప్రయోగించి, ఆయనను తన చెప్పుచేత లలో ఉంచుకుని, తాను మాణిక్యపురి సింహాసనం అధిష్ఠించాలని ఆ దుర్మార్గుడు పథకం వేశాడు."

ఇంతవరకు చెప్పిన రాజగురువు, "అతని పథకం నెరవేరలేదు కదా?" అని యువరాణి అడగడంతో కొంతసేపు ఆగి, "లేదు, యువరాణీ! అతని కుటిల పథకం నెరవేరలేదు. ఆ సంగతే చెబుతున్నాను,



శ్రద్ధగా విను," అంటూ మళ్ళీ చెప్పడం ప్రారంభించాడు:

"ఆ సమయంలో కులశ్రేష్ఠుడనే పండితుడు భైరంభీమాత ఆలయానికి ప్రధాన పూజారిగా ఉండేవాడు. ఆయన కొక అందమైన కుమార్తె ఉండేది; పేరు భాగ్యశ్రీ. ఆమెను చూడగానే చంద్రకేతు ఆమె అందానికిముగ్ధుడయ్యాడు. ఆమె ఆలయపూజారి కుమార్తె అన్న సంగతి తెలియక, తాను తయారుచేసిన పుష్పతైలాన్ని ప్రయోగించి ఆమె మనసును తన వైపు మళ్ళించుకోవాలని ఆశించాడు. ఒకనాడామె తన చెలికత్తెలతో కలిసి, దాపులనున్న నదిలో స్నానం చేసి, గుడికి రావడం చూసి, చంద్రకేతు ఒక చెట్టుచాటున పొంచి వుండి, ఆమె మీద తాను తయారుచేసిన తైలం చల్లాడు. మరుక్షణమే భాగ్యశ్రీ దిక్కులు అదిరే విధంగా కేకలు వేస్తూ అటు ఇటూ పరిగెత్త సాగింది. వెంటనున్న చెలికత్తెలు ఆమెకు ఏమయిందో గ్రహించలేక ఆమెను పట్టుకోబోయారు. ఆ విషయం పూజారికి చెప్పడానికి కొందరు గుడి లోపలికి వెళ్ళారు. ఇంకా కొందరు చేతిలో ఏదో పాత్ర, ఆకులతో పరిగెత్తుతున్న చంద్రకేతును పట్టుకోమనిఅరవడంతో, దారినవెళుతున్నవాళ్ళు అతన్ని పట్టుకుని గుడికేసి లాక్కు వెళ్ళారు.

పూజా సమయం సమీపించడంతో, దేవతా విగ్రహ అలంకరణలో నిమగ్నుడై వున్న పూజారి కులశ్రేష్ఠుడు, స్త్రీల ఆర్తనాదాలు విని, వెలుపలికి వచ్చి, అక్కడి దృశ్యం చూసి, ఒక్క క్షణం దిగ్భ్రాంతి చెందాడు. ఆయన కూతురును సమీపించి ఆమె భుజాన్ని పట్టి కుదుపుతూ, "భాగ్యశ్రీ! ఏమయింది, తల్లీ?" అని అడిగాడు.

భాగ్యశ్రీ నోటి నుంచి మాటరాలేదు. ఆమె కొంతసేపు అటూఇటూ దిక్కులు చూసి సొమ్మసిల్లి పడిపోయింది! ఆమెను పట్టుకుని ఉన్న చెలికత్తెలు, "నదికి వెళ్ళి వస్తూన్న భాగ్యశ్రీ మీద, ఆ మనిషి ఏదో చల్లాడు. ఆ క్షణం నుంచి ఈమె ఇలా వెర్రెత్తిన దానిలా ప్రవర్తిస్తున్నది," అంటూ జనం మధ్య ఉన్న చంద్రకేతును చూపారు.

పూజారి అతడికేసి నాలుగడుగులు వేసి, "ఎవరు నువ్వు? నా కుమార్తెను ఏం చేశావు?" అని అడిగాడు కోపంగా.

"మహాత్మా! ఆమె మీ కుమార్తె అని తెలియక ఈ అపరాధం జరిగిపోయింది. కోయవాడు చెప్పిన ప్రకారం కొన్ని విచిత్ర పుష్పాలను సేకరించి, తైలం తయారు చేశాను. ఆ తైల ప్రభావాన్ని శోధించి చూడడానికి, దానిని తమ కుమార్తె అని తెలియక ఆ యువతిపై చల్లాను అంతే! మరొక పాపం ఎరుగను, నన్ను..." అని ఇంకేదో చెప్పబోయాడు చంద్రకేతు.

అయినా, పూజారి ఆ మాటలను పట్టించుకోకుండా గబగబా ఆలయం లోపలికి వెళ్ళాడు. దేవీ విగ్రహం మెడలో ఉన్న పుష్పహారాన్ని తీసుకుని వెలుపలికి వచ్చి, "మాతా, భైరంబీ! నిన్నే దిక్కుగా భావించి, లోకక్షేమం కోసం నిన్ను పూజిస్తున్న నేను, ఇంతవరకు నిన్ను నాకోసం ఏదీ అడగ లేదు. ఈ రోజు, లేక లేక కలిగిన నా ఒక్కగానొక్క కూతురికి పట్టిన గతి చూడు! ఆమెను రక్షించే భారం నీది. నా బిడ్డకు ఈ గతి పట్టించిన ఆ నరరూప రాక్షసుడు నాశనమై పోవుగాక! నీ భక్తుణ్ణయిన నా బిడ్డకు కష్టం కలిగించిన ఆ పుష్పం మళ్ళీ పుష్పించకుండా పోవుగాక!" అని శపిస్తూ, చేతిలోని పుష్పహారాన్ని తెంచి ఆగ్రహావేశంతో చంద్రకేతుడి మీదికి విసిరి కొట్టాడు.

మరుక్షణమే పూజారి ఎదుట ఒక వింత వెలుగు వెలిగింది. ఆ వెలుగు మధ్య





తారు. సరే, ప్రస్తుతానికి అన్నీ మరిచిపో. ఆలయం లోపలికి రా! హారతికి సమయం దాటిపోతున్నది.నీకోసంకాచుకునిఉన్నాను," అన్నది, పూజారికి మాత్రం వినిపించే విధంగా.దేవీరూపంకూడా పూజారికిమాత్రమే కనిపించింది.

పూజారి సంతోషంగా లోపలికి వెళ్ళి, దేవీ విగ్రహానికి హారతి ఇచ్చి, ప్రశాంత హృదయంతో వెలుపలికి వచ్చాడు. కుమార్తె కళ్ళు తెరచి చిరునవ్వుతో, ఆయన పక్కన వచ్చి నిలబడింది. అక్కడ చేరిన వారు, భాగ్యశ్రీ మీద తైలం చల్లినవాడు యువ రాజు చంద్రకేతుడనీ, అతడు తప్పించుకుని పారిపోతూ ఉండగా దూరం నుంచి రాక్షసుడిలాగా కనిపించాడనీ చెప్పారు.

విషయం తెలియగానే రాజు చంద్రకాంతుడు తమ్ముడి దుర్మార్గానికి సిగ్గు పడ్డాడు. పూజారి, రాజు దగ్గరికి వెళ్ళి, జరిగిన దానికి క్షమాపణలు చెప్పుకున్నాడు. రాజు పూజారిని ఓదార్చుతూ, "మీ కుమార్తె కోలుకున్న తరవాత ఆమెను రాజసౌధానికి పంపించు. కొంతకాలం నా కుమార్తెతో కలిసి గడిపిందంటే త్వరగా మామూలు మనిషి అవుతుంది!" అన్నాడు.

రాజగురువు ఇంతవరకు చెప్పి, "నేనీ విషయాలను చంద్రకాంత మహారాజు ఘనతను వివరించే తాళపత్రగ్రంథాలలో చదివాను. దేవీ శాపానికి గురైన పుష్పం

లైరంబీమాత ప్రత్యక్షమై, మందహాసం చేస్తూ, "బిడ్డా! నీ ప్రార్థన ఆలకించాను. నీ కుమార్తెకు ఎటువంటి హానీ కలగదు. ఆమె త్వరలో మామూలు మనిషి అవుతుంది. నీ కుమార్తెకు హాని తలపెట్టినవాణ్ణి నువ్వు నీ నోటితో నరరూపరాక్షసుడన్నావు. వాడు నిజంగానే రాక్షసుడుగా మారిపోతాడు. వాడికి ఈ భూమిమీద స్థానం ఉండదు. పువ్వులో ఏ దోషమూ లేనప్పటికీ అది ఆ దుర్మార్గుడి హీనకృత్యానికి ఉపయోగపడింది. కాబట్టి, నీ ఇష్టానుసారం ఆ పువ్వు ఇప్పుడిప్పుడే పూయదు. మునుముందు పూచినప్పటికీ, ప్రకృతికి విరుద్ధంగా ప్రవర్తించే వాళ్ళే దాని మూలంగా కష్టాల పాలవు

నూరేళ్ళ కొకసారి పూస్తుందనీ, అందుకే దానిని 'శతాబ్దిక' అని పిలుస్తారనీ విన్నాను. ఇప్పుడీ పువ్వులను చూస్తూంటే ఆ విష యాలు జ్ఞాపకం వచ్చాయి. ప్రజల శాంతి భద్రతలు కాపాడడం మీ బాధ్యత కాబట్టి ఆ విషయాలను మీకు తెలియజేసి హెచ్చ రించడం నా కర్తవ్యంగా భావించి వచ్చాను," అని చెప్పడం పూర్తిచేశాడు.

రాజు ప్రతాపవర్మ అంతావిని, దీర్ఘంగా ఆలోచించి, కుమార్తె వైపు తిరిగి, "ప్రియం వదా! ఆ పువ్వులను రాజభవనంలో ఉంచ కూడదని రాజగురువు సెలవిచ్చారు. కాబట్టి వాటిని ఉద్యానవనంలోకి తరలించడం అవసరం!" అన్నాడు.

ప్రియంవద, "అలాగే చేద్దాం, నాన్నా! ఇప్పుడే వాటిని తీయించే ఏర్పాట్లు చేస్తాను," అని రాజుతో అని, గురువు వైపు తిరిగి, "మధుర పరిమళాలు విరజిమ్మే ఆ పువ్వుల వెనక ఇలాంటి విషాద గాథ ఉండడం దుర దృష్టకరం!" అన్నది.

అంతలో ఒక భటుడు వచ్చి రాజుకు నమస్కరించి, "ప్రభూ! సేనాధిపతి తమ దర్శనం కోసం వెలుపల వేచి ఉన్నారు!" అన్నాడు.

"రమ్మను!" అన్నాడు రాజు.

భటుడు వెళ్ళిన కొంతసేపటికి సేనాధి పతి వచ్చి, రాజుకూ, రాజగురువుకూ నమస్కరించాడు.



"ఏమిటి! నిన్ను చూస్తూంటే పెద్ద సమ స్యతో వచ్చినట్టున్నావు!"అనిఅడిగాడురాజు.

"నిజమే, ప్రభూ! పెద్ద సమస్యే ఎదుర యింది. ఈరోజు వేకువ జామునుంచి, మన రాజ్య దక్షిణ సరిహద్దులోని ప్రజలు ఇళ్ళు వదిలిపెట్టి చెట్టుకొకరు పుట్టకొకరుగా పరుగులు తీస్తున్నారు. కొందరు రాజధానీ నగరం వైపు వస్తున్నారు. తెల్లవారేసరికి సముద్రతీరంలోని ఇళ్ళన్నీ నేలమట్టమై ఉన్నాయి. ఇందుకు భూకంపం గాని, సముద్ర కెరటం వచ్చి ముంచిపోయిన దాఖలాలు గాని లేవు. పైగా అన్ని ఇళ్ళు కూలినప్పటికీ ఎలాంటి శబ్దమూ రాలేదట. అదృష్టవశాత్తు జననష్టం ఏమీ వాటిల్లలేదని

వార్తలు అందుతున్నాయి. ఎందుకిలా జరిగిందో ఊహించడం కష్టంగా ఉన్నది!" అన్నాడు సేనాధిపతి గంభీరవర్మ.

"సరే, ప్రజల రక్షణకు ఏమైనా ఏర్పాట్లు చేశావా?" అని అడిగాడు రాజు.

"అప్పుడే మన సైనికులు కొందరిని సముద్రతీరం కాపలాకు పంపాను. అనుమానాస్పదంగా ఎవరైనా కనిపిస్తే బంధించి తీసుకురమ్మని ఆజ్ఞాపించాను. మరొక సైనిక దళాన్ని, కష్టాలలో ఉన్న ప్రజలను ఆదుకోవడానికి పంపాను. ఇంకా కొందరు సైనికులను నగర ద్వారం దగ్గరికి పంపి, పారిపోయి వచ్చే వాళ్ళకోసం ఏర్పాటు చేసిన ప్రత్యేక శిబిరాలకు తీసుకువెళ్ళమని చెప్పాను. ఈ విషయాలను తమకు తెలియజేయడానికే వచ్చాను," అన్నాడు సేనాధిపతి.

"నివాసాలు పోగొట్టుకున్నవారిలో కొందరికి మన రాజప్రాసాదంలోనే ఆశ్రయం కల్పించవచ్చుగదా! ముఖ్యంగా స్త్రీలనూ, పిల్లలనూ ఇక్కడికి పంపండి!" అన్నది యువరాణి ప్రియంవద ఆతృతతో.

"మంచి ఆలోచన! మన రాజభవనంలో ఏ భాగాన్ని బాధితులకు కేటాయిస్తే బావుంటుందో నువ్వే ఆలోచించి చెప్పు. పైగా ఇక్కడికి వచ్చే స్త్రీలకూ, పిల్లలకూ అవసరమైన సదుపాయాలను సమకూర్చే పనులను నువ్వే స్వయంగా పర్యవేక్షించడం మరీ బావుంటుంది," అని రాజు కుమార్తెతో చెప్పి, సేనాధిపతివైపు తిరిగి, "బాధితులకు ఎటువంటి లోటూ రాకుండా చూసే బాధ్యత నీది. వారికి మునుముందు ఎటువంటి ఉపాధి కల్పించాలో తరవాత ఆలోచిద్దాం!" అని రాజగురువుకేసి తిరిగి, "తమరి సలహా ఏమిటి గురుదేవా!" అని అడిగాడు.

"అలాగే చెయ్యి, మహారాజా!" అని రాజగురువు కొంతసేపు మౌనంగా ఆలోచించి, "సేనాధిపతి తెచ్చిన వార్తను వింటూంటే, 'శతాబ్దిక' గురించి నేను అనుమానించిన విషయాలు నిజమవుతాయేమోనని భయంగా ఉన్నది, మహారాజా!" అన్నాడు విచారంగా. — (ఇంకావుంది)






# మంచిమిత్రులు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, ఈ అర్ధరాత్రి వేళ భీతిగొలిపే ఈ శ్మశానంలో, నువ్వు ఇన్ని శ్రమలకోర్చడం, నీకోసమా లేక పరుల కోసమా అన్న శంక కలుగుతున్నది. నీ కోసమే అయితే, నేనివ్వగల సలహా ఏమీ లేదు. అలాకాక మరెవరి ఆజ్ఞనో పాటించి, నువ్వు ఇన్ని శ్రమలకు గురి అవుతూంటే మాత్రం, నీకు హెచ్చరికగా వుండేందుకు, ఒక సలహా ఇవ్వదలిచాను. మనిషి కొన్ని సందర్భాలలో అనాలోచితంగా, పెద్దవాళ్ళ ఆజ్ఞలుపాటించడం తనవిధి అన్న భావంతో, అనవసరమైన ఇక్కట్ల పాలు కావడం జరుగు తుంది. అయితే, ఆజ్ఞ లిచ్చిన పెద్దలు మాత్రం కార్యం సఫలమయ్యాక,

## బేతాళ కథలు



తమ కారణంగానే కార్యసాధన జరిగిందంటారు. అలా కాదని ప్రశ్నిస్తే, డొంక తిరుగుడు జవాబులతో అసలు విషయాన్ని దాటవేస్తారు. అంటే కార్యసాధకుడొకడైతే, కీర్తి మరొకరి దన్నమాట! ఇందుకు నిదర్శనంగా ధనదత్తుడనే వర్తకుడి కథ చెబుతాను, శ్రమతెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒకానొక పట్టణంలో ధనదత్తుడనే వర్తకుడుండేవాడు. ఆయన తన సరుకులను ఓడలపై విదేశాలకు పంపి వ్యాపారం చేసేవాడు. ఆ వ్యాపారం లాభసాటిగా సాగుతున్నదని, ఆయన ఉన్నడబ్బంతా వెచ్చించి స్వయంగా ఒక ఓడ కొన్నాడు. ఆయనవే కాక ఎందరో ఇతర వర్తకుల సరుకులతో బయల్దేరిన ఆ ఓడ, సముద్రంలో మునిగిపోయినట్టు వార్త వచ్చింది.

ధనదత్తుడు వ్యాపారంలో బాగుపడ్డాడని అసూయ చెందే వర్తకులు కొందరున్నారు. వాళ్ళందరూ తమ సరుకుల విలువ చెల్లించాలని ఆయనపై వత్తిడి తెచ్చారు. ధనదత్తుడు వాళ్ళందరికీ వెలకట్టి సరుకుల డబ్బిచ్చేశాడు. దాంతో ఆయనకు పూట గడవడమే కష్టమయింది.

ధనదత్తుడికి యాభైవేల విలువ చేసే పెద్ద భవనమున్నది. అందులో ఎందరో పనివాళ్ళున్నారు. ఆయన ఆ పని వాళ్ళందరినీ మానిపించేశాడు. భవనం పదివేల వరహాలకు తాకట్టులో వుంది. రెండు మాసాల్లో డబ్బుకట్టకపోతే, ఆయనకా ఇల్లు కూడా మిగలదు. పోనీ ఇప్పుడే అమ్మేద్దామా అంటే, ఆయన పరిస్థితి చూసి, ఆ ఇంటికెవరూ ఇరవై వేల వరహాలకంటే ఎక్కువ ఇవ్వమంటున్నారు.

ఇలాంటి పరిస్థితిలో ధనదత్తుడు తన కుమారుడైన దేవదత్తుణ్ణి పిలిచి, "నాయనా! నువ్వునాకుచేదోడువాదోడుగావుండగలంత వయసువాడివి అయ్యావు. అయితే, ఇంత కాలం నువ్వు మన వైభవాన్నే చూశావు. ఇప్పుడు మనకు గడ్డుకాలంవచ్చింది. నీకు వ్యాపారాన్నప్పజెబుదామనుకునేంతలో,ఇలా నష్టపడటం నా దురదృష్టం. అయినా ఇదీ

ఒకందుకు మంచిదే ననుకుంటున్నాను. ఇప్పుడు కొద్దిగా పెట్టుబడి దొరికితే చాలు, రెండేళ్ళు తిరక్కుండా ఇంతకింత సంపాదిస్తాను. ఈ పట్నంలో మనకు సాయపడే వాళ్ళెవరూ లేరు. ఇప్పుడు నువ్వు, నా స్వగ్రామమైన రత్నాపురం వెళ్ళు. అక్కడ చంద్రశేఖరుడనే దూరపు బంధువున్నాడు. ఆయన కోటికి పడగలెత్తినవాడు. వరసకు నీకు తాతయ్య అవుతాడు. ఆయన మాత్రమే మనకు సాయపడతాడు. నువ్వు పాతికవేల వరహాలాయన్నడిగి పట్టుకురా. ఆ ధనంతో నేనిక్కడ మిగిలివున్న బాకీ తీర్చేసి, మిగతా డబ్బుతో వ్యాపారం ఎలా చేయాలో నీకు నేర్పుతాను," అన్నాడు.



దేవదత్తుడువెంటనేప్రయాణమయ్యాడు. బయల్దేరే ముందు తండ్రి వాడితో, "నువ్వు సాయంత్రానికల్లా ముత్యాలపురం చేరుకుంటావు. అక్కడ నా ప్రాణమిత్రుడు రమాకాంతుడుంటాడు. ఆయనింట్లో బసచేసి రాత్రికక్కడే వుండిపో. తెల్లవారుతూనే బయల్దేరితే ఎండెక్కకుండా రత్నాపురం చేరుకుంటావు. ఏ కారణం చేతనైనా చంద్రశేఖరుడూళ్ళో లేకపోతే, ఆయన వచ్చేదాకా నా బాల్యమిత్రుడైన వినయసేనుడింట్లో వుండు. పొరబాటునకూడా ఆయననుకానీ, రమాకాంతుణ్ణి కానీ డబ్బు కావాలని అడగొద్దు. అడిగితేవాళ్ళు తలతాకట్టుపెట్టయినా సరే మనకు డబ్బిస్తారు. అయినా వాళ్ళనిబ్బంధి పెట్టడం మనకు భావ్యం కాదు," అన్నాడు.

తండ్రి చెప్పినట్లే ప్రయాణం చేసి, దేవదత్తుడు ముందు ముత్యాలపురం చేరి రమాకాంతుడింటికి వెళ్ళాడు. ఆయన వాడిని ప్రేమతో ఆదరించాడు. వాడి ద్వారా పరిస్థితి తెలుసుకున్నాక, "ఇలాంటి పరిస్థితుల్లో డబ్బుకోసం మమ్మల్నడక్క, చంద్రశేఖరుడి నడగాలని మీ నాన్న కెలా బుద్ధి పుట్టింది? మీ నాన్నకు చిన్నతనంలోనే తల్లీ తండ్రీపోతే, ఆ చంద్రశేఖరుడు మీ ఇంట్లో చేరాడు. మోసం చేసి మీ ఆస్తంతా కాజేశాడు. చివరకు పొట్టచేతబట్టుకుని పట్నం వెళ్ళి బాగుపడ్డాడు, మీనాన్న. ఆ చంద్ర



శేఖరుడు మహాపిసినారి. నీకెందుకు డబ్బిస్తాడు?" అన్నాడు రమాకాంతుడు.

"మిమ్మల్ని డబ్బడగొద్దని, నాన్న నాకు చెప్పాడు," అన్నాడు దేవదత్తుడు.

రమాకాంతుడు ఒక క్షణం ఆలోచించి, "ఆయనలా ఎందుకు చెప్పాడో నాకు తెలుసు. ఆయన కష్టాల్లో వున్నప్పుడు నేను సాయపడలేకపోయినా, బాగుపడ్డాక ఆయన్నుంచి సాయం పొందాను. నేనాయనకు అయిదు వేల వరహాలు బాకీ వున్నాను. ఇలాంటి సమయంలో ఇవ్వకపోతే, ఇంకెప్పుడు తీరుస్తా నాబాకీ? తీసుకుని వెళ్ళు. ఇప్పుడు నాకు పూర్వపు ఇబ్బందులేమీ లేవని మీనాన్నకు చెప్పు," అన్నాడు.

డబ్బు తిరుగుప్రయాణంలో తీసుకుంటానని దేవదత్తుడంటే, "నేను చెప్పినట్టు చేయనిపక్షంలో, నేను మళ్ళీ మీనాన్న మొహంచూడను,"అన్నాడురమాకాంతుడు.

దేవదత్తుడు అక్కణ్ణించి ప్రయాణంచేసి రత్నాపురం చేరుకున్నాడు. అయితే, చంద్రశేఖరుడూళ్ళోలేడు. వాడు, తండ్రి చెప్పిన విధంగా వినయసేనుడింటికి వెళ్ళాడు. ఆయన దేవదత్తుణ్ణి ఆప్యాయంగా కౌగలించుకుని, వచ్చిన పని అడిగి తెలుసుకుని, "చంద్రశేఖరుడు మీ ఆస్తంతా అపహరించి దాన్ని పెంచుకుంటూ పోతున్నాడు. అయినా, ఆయన ధనదాహం తీరలేదు. ఏమనుకుని అన్నీ తెలిసి కూడా మీనాన్న, ఆ చంద్రశేఖరుడి దగ్గరకు నిన్ను పంపించాడో నాకు అర్థం కాకుండా వుంది. మీకింత అన్యాయం చేశాక, ఇలాంటి పరిస్థితుల్లో కూడా నువ్వొచ్చి అడిగితే లేదనడానికి ముఖం చెల్లివుండదు. నువ్వొస్తున్నావని ముందే తెలిసి ఆయన ఊరొదిలిపోయుంటాడు. నువ్వు వెళ్ళావని తెలిసేదాకా మళ్ళీ తిరిగిరాడు. నువ్వాయనకోసం ఎదురుచూడడంవృథా! నీక్కావలసిన డబ్బు నేనేర్పాటు చేస్తాను," అన్నాడు.

ఇది విని దేవదత్తుడు కంగారు పడి, తండ్రి హెచ్చరిక గురించి చెప్పి, "మీ వంటి మంచివారుండగా, నాన్న ఆ చంద్రశేఖరుణ్ణే ఎందుకు పట్టుకుని వ్రేలాడుతున్నాడో నాకు



అర్థం కాకుండా వుంది. ముత్యాలపురం రమాకాంతుడి విషయంలోనూ ఇంతే జరిగింది," అంటూ తన అనుభవం చెప్పాడు.

వినయసేనుడు నవ్వి, "ఈ ఊరు నుంచి ఎవరు పట్టణం వెళ్ళినా, మీనాన్న లేదనకుండా,కాదనకుండాడబ్బిచ్చిసాయం చేసేవాడు. ఇచ్చిన వారినడగడం ఆయన కిష్టముండదు. కానీ ఇలాంటి సమయంలో ఆదుకోక పోతే మేము స్నేహితులమెలా అవుతాము? అయినా తీసుకున్న డబ్బు తిరిగి ఇవ్వడం ఆదుకోవడం అనిపించు కోదు. నాతో సహా మీనాన్నకు బాకీ పడ్డ వాళ్ళు, ఈ ఊళ్ళో చాలామందే వున్నారు. అదంతా నేను వసూలు చేసి ఇస్తాను. ఇందులో మాకే ఇబ్బందీ లేదు," అన్నాడు.

దేవదత్తుడు వెంటనే ఒప్పుకోలేదు. వాడక్కడ రెండు రోజులున్నాడు. చంద్రశేఖరుడి జాడలేదు.వినయసేనుడుతానివ్వవలసిందీ, ఊళ్ళో వసూలు చేసిందీ కలిపి ముప్ఫైవేల వరహాలిచ్చాడు. ఆ డబ్బునూ, ముత్యాలపురంలోని రమాకాంతుడిచ్చిన డబ్బూ తీసుకుని దేవదత్తుడు ఇల్లు చేరేసరికి, అక్కడ ఒక వృద్ధుడుండడం గమనించాడు.

ధనదత్తుడాయనను కొడుక్కు పరిచయం చేస్తూ, "ఈయనగారి పేరు చంద్రశేఖరుడు. రత్నాపురం నుంచి ఏదో పని మీద ఈ ఊరొచ్చి జబ్బుపడ్డాడు. మనింట్లో వుంచుకుని వైద్యం చేయించాను. వెంట తెచ్చుకున్న డబ్బు అయిపోయిందట. ఈయన తిరుగు ప్రయాణానికి మనమే ఏర్పాటుచేయాలి. పాదాభివందనం చెయ్యి. వరసకునీకుతాతయ్యఅవుతాడు," అన్నాడు.

దేవదత్తుడు, చంద్రశేఖరుడికి పాదాభివందనం చేసి, ఆయన ప్రయాణానికి ఏర్పాట్లు చేశాడు. తర్వాత వాడు తను తెచ్చిన డబ్బును తండ్రికిచ్చి, "నీకు ఎంతో మంది మంచి మిత్రులుండగా, నన్ను ఈ పిసినారి చంద్రశేఖరుడి వద్దకు పంపడం ఆశ్చర్యంగా వుంది!" అన్నాడు.

ఇందుకు ధనదత్తుడు, "నీకు ప్రాపంచిక విషయాలతోపాటు, వ్యాపార పద్ధతుల్లోని మెలుకువలు చెప్పి తగిన శిక్షణ ఇవ్వాలని

అనుకుంటున్నాను. అందులో నిన్ను చంద్ర శేఖరుడివద్దకుపంపడంఒకభాగం," అన్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, ధనదత్తుడు తనకెందరో మంచి మిత్రులుండగా, కొడుకు దేవదత్తుణ్ణి, చంద్ర శేఖరుడి వంటి మోసకారీ, పిసినారీ వద్దకు పంపడం ఏమన్న వివేకం, సందర్భశుద్ధీ అనిపించుకుంటుంది? పైగా అతడు తన పొరపాటును కప్పి పుచ్చుకునేందుకు కొడుకుతో ప్రాపంచిక విషయాలూ, వ్యాపార పద్ధతుల్లో మెలుకువలూ అంటూ మాట్లాడడం కేవలం డొంక తిరుగుడు జవాబే కదా? కార్యం సాధించుకు వచ్చిన వాడు కొడుకైతే, అందుకు కారణం తన ప్రయత్నమే అన్నట్టు ధనదత్తుడు ప్రవర్తించడం, అతడిలో నిజాయితీ లోపించిందన డానికి తార్కాణం కాదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ధనదత్తుడు జీవితాన్ని కాచి వడబోసిన వాడు. అతడు పిసినారి చంద్రశేఖరుణ్ణి డబ్బడగమని కొడుకును పంపడంలోనే, అతడి మంచి మిత్రులందరూ ధనదత్తుడి పరిస్థితి ఎంత అధ్వాన్నంగా వున్నదో ఊహించుకోగలరు. అలాంటి స్థితిలో కూడా తామివ్వవలసిన బాకీ డబ్బు అడగక పోవడం వల్ల, అతడి మిత్రులకు అతడిపై మరింత గౌరవం పెరుగుతుంది. ఆ విధంగా వాళ్ళు కోర కుండానే ధనదత్తుడి బాకీ డబ్బు చెల్లు వేసి, తాము మంచి మిత్రులమని ఋజువు చేసుకున్నారు. ఇలా తమ గాఢమైత్రిని ఋజువు పరచుకునేందుకు మాత్రమే చంద్రశేఖరుణ్ణి, ధనదత్తుడు ఉపయోగించుకున్నాడు. ఈ కారణాలవల్ల ధనదత్తుడు, తన కొడుక్కు ఇచ్చిన జవాబులో డొంకతిరుగుడూ,నిజాయితీ లోపం అంటూ ఏమీలేదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. — (కల్పితం)

[ఆధారం : జొన్నలగడ్డ రామలక్ష్మి రచన]





# మతిమరుపు మంత్రం

గవర్రాజు పెద్దభూస్వామి. ఘరానాగా అప్పులు చేయడంలోనూ, అవి తీర్చవలసి వచ్చే సరికి మొండిచేయి చూపించడంలోనూ, ఆయన్ని మించిన వారు లేరు.

ఒకనాడు నలుగురు ఆశ్రితుల్ని వెంట బెట్టుకుని, చేతికి తగిలించుకున్న కొంకి కర్ర ఊపుకుంటూ వీధివెంట పోతున్న గవర్రాజుకు, కామయ్యశెట్టి మిఠాయిదుకాణం నుంచి కమ్మని నేతిమిఠాయి వాసన తగిలి నోరూరింది. ఆయన తన ఆశ్రితులతో హుందాగా కామయ్యశెట్టి దుకాణంలో ప్రవేశించి, "ఏం శెట్టీ! అలా వీధినపోతుంటే, నీ మిఠాయిల వాసన నన్ను గాలం వేసి, నీ దుకాణంలోకి గుంజిందనుకో. మిఠాయి వాసనలోనేనా లేక రుచిలో కూడా అంత బావుంటవా?" అని అడిగాడు నవ్వుతూ.

"అయ్యా, తిని చూడండి, తమకే తెలుస్తుంది," అన్నాడు కామయ్యశెట్టి వినయంగా.

గవర్రాజు తీరుతీరుగా తనకు నచ్చిన మిఠాయిలు తిని, ఆశ్రితులకుకూడా పెట్టించాడు. ఆయనకు డబ్బెంత ఇవ్వవలసి వస్తుందో అన్న బెంగలేదు. కామయ్యశెట్టికి దమ్మిడీకూడా ఇచ్చేఅవసరంలేదని ముందే ఆయన నిర్ణయించుకున్నాడు.

తినడం పూర్తయ్యాక గవర్రాజు, "ఫర్వాలేదు, మిఠాయిలు బాగానే వున్నవి," అని కామయ్యశెట్టిని మెచ్చుకుని, "సరే, మొత్తం ఎంతయిందో లెక్క కట్టు," అన్నాడు.

కామయ్యశెట్టి తన దగ్గిరున్న పలకమీద, గవర్రాజూ, ఆయన ఆశ్రితులూ తిన్న మిఠాయిల ఖరీదు లెక్కకట్టి, "అయ్యా, మొత్తం యాభైరూపాయిలయింది," అన్నాడు.

గవర్రాజు జేబులో చేయి పెట్టి కాసేపు వెదికి, "నా మతిమరుపుమండ! ఏం జరిగిందో చూశావా, శెట్టీ! డబ్బు ఒక చొక్కా జేబులో పెట్టి, మరొక చొక్కా వేసుకుని

వారణాశి రామకృష్ణ

బయలుదేరాను. అయినా, మునిగిపోయిందే ముందిలే! నేను మళ్ళీ ఇటువచ్చినప్పుడు, నేనివ్వవలసినదెంతోగుర్తుచెయ్యి," అన్నాడు.

గవర్రాజుది మొండిపద్దన్న సంగతి కామయ్యశెట్టికి బాగా తెలుసు. అతని విన యంమాటల్లోనే, చేతల్లో మాత్రం మహా గడుసరి. ముల్లునుముల్లుతోనే తీయాలని నిర్ణయించుకున్న శెట్టి, "అయ్యా, నాకు మాత్రం జ్ఞాపకశక్తి ఎక్కడేడ్చింది! ఈ విష యంలో నేను తమకేమాత్రం తీసిపోను. మీపేరూ, బాకీసొమ్ము మొత్తం ఈ గోడ మీద రాసి వుంచుతాను. అది చూసినప్పు డల్లా నాకు, మీ బాకీ సంగతి గుర్తుకు వస్తుంది. ఆపైన మీకు గుర్తుచేయడానికి వీలుంటుంది," అంటూ గోడ మీద తాటి కాయంత అక్షరాలతో రాయసాగాడు.

అదిచూసి గవర్రాజు కంగారుగా, "అరెరె! అంతలేసి అక్షరాలతో నాపేరూ, బాకీ రాస్తు న్నావు. నీ దుకాణానికి వచ్చిన వాళ్ళందరూ ఇది చూస్తారు. నాకెంత అమర్యాద! పరువు తక్కువ!" అన్నాడు.

కామయ్యశెట్టి చేసిన దానికి బాధపడి పోతున్న వాడిలా ముఖం పెట్టి, "అయ్యా, తమరన్నది అక్షరాలా నిజం! ఆ సంగతి నేనాలోచించనే లేదు, సుమండీ. సరే, మీ పట్టు పైపంచ ఇలా ఇప్పించండి. గోడకు తగిలించి వుంచుతాను, అది చూసినప్పు డల్లా నాకూ, అది భుజం మీద లేదని తెలిసి నప్పుడల్లా మీకూ—చప్పున బాకీ సంగతి గుర్తుకొస్తుంది. సంగతి మూడోకంటికి తెలి యదు. మన ఇద్దరి మతిమరుపుకు ఇదే మంచి పరిష్కారం!" అన్నాడు.

ముందు గొయ్యి, వెనక నుయ్యిలా తయారయింది గవర్రాజు పరిస్థితి.

పై పంచ శెట్టికి ఇచ్చినా, గోడమీద తన పేరు అలాగే వుంచినా ఊళ్ళో పరువు పోక తప్పదు.

తన మతిమరుపు మంత్రం, కామయ్య శెట్టిమీద పారదని గ్రహించిన గవర్రాజు, మారుమాట్లాడకుండా శెట్టికి డబ్బుచెల్లించి, దుకాణంలో నుంచి వేగంగా బయటికి నడిచాడు.



# చందమామ
# అనుబంధం - 55

మనదేశపు పక్షులు - జంతువులు:

## లకుముకి పిట్టలు



కొన్ని పక్షులు మాత్రమే చెట్లకొమ్మలను వదలి నేల మీద గూళ్ళు నిర్మించుకుంటాయి. అటువంటి వాటిలో లకుముకి పిట్టలు చాలా ముఖ్యమైనవి. మామూలుగా ఇవి కాలువగట్లమీద ఒక మీటరు పొడవు బొరియలు తవ్వి, లోపల ఐదారు గుడ్లు పెట్టడానికి కావలసిన విశాలమైన స్థలం ఏర్పరచుకుంటాయి. మార్చ్-జూన్ నెలల మధ్య ఇవి గుడ్లు పెడతాయి.

ప్రపంచం మొత్తం మీద లకుముకి పిట్టలలో వందకు మించిన రకాలు ఉన్నాయి. వాటిలో ప్రధానమైనవి మైనా పిట్టల పరిమాణంలో తెల్లటి అడుగుభాగం గలవి. వాటి రెక్కలు మెరిసే నీలి రంగులో ఉంటాయి. రెక్కల అడుగుభాగం ఊదాగా ఉంటుంది. వీటి ముక్కు ఎర్రగానూ, చేపలూ, కప్ప పిల్లలూ మొదలైన వాటిని పట్టడానికి అనువుగా మొనదేలి దృఢంగానూ ఉంటుంది. నీళ్ళపైభాగంలోని కొమ్మలమీద వాలి కూర్చున్న లకుముకి పిట్టలు నీళ్ళలో ఆహారం కనబడగానే వెంటనే ఎగిరి వాటిని పట్టి తీసుకెళ్ళి రాయికేసి లేదా కొమ్మకేసి కొట్టి చంపి, తల నుంచి మొదలుపెట్టి తింటాయి.

వీటిలో తెలుపు - నలుపు రంగుల లకుముకి పిట్టలు ఆహార అన్వేషణలో మరీ చురుకుగా ఉంటాయి. నీళ్ళపై భాగంలో ఒకవైపు నుంచి మరొకవైపుకు ఎగురుతూ, ఆహారం కనిపించగానే ఒక్క ఊపున వెళ్ళి పట్టేస్తాయి.

వీటన్నిటిలోకీ హిమాలయాలలోని రంగుల పిట్టలే పరిమాణంలో పెద్దవి. ఇవి సముద్రమట్టానికి దాదాపు 800 అడుగుల ఎత్తులో నివసిస్తాయి.



# మన సమకాలీన సాహిత్యం

కర్రసాములోనూ, పులి ఆటలోనూ తన గ్రామంలోని చిన్నా పెద్దా అందరినీ అలరించే పుల్లయ్య అనే యువకుడు– పెళ్ళి చేసుకుని, ధైర్యసాహసాలలో తనను మించిన కొడుకును కనాలని తరచూ కలలు కనేవాడు. అబద్ధాలాడేవాళ్ళన్నా, దొంగలన్నా పుల్లయ్యకు పరమ అసహ్యం. తన కొడుకు పెరిగి పెద్దవాడై దొంగలను పట్టడంలో నేర్పరిగా పేరెత్తాలని కూడా అతడు కలలు కనేవాడు.

పుల్లయ్య నీలి అనే అమ్మాయిని ప్రేమించి పెళ్ళి చేసుకున్నాడు. నీలి కూడా భర్తలాగే సత్యాన్ని ప్రేమించేది. పేదలే అయినప్పటికీ వాళ్ళు చాలా నిజాయితీ పరులు; తమకు కావలసిన ధాన్యాన్ని రాత్రింబవళ్ళు

## బలివాడ కాంతారావు 'దగాపడిన తమ్ముడు'



కష్టపడి పని చేసి పండించుకునేవాళ్ళు. వాళ్ళు ఆశించినట్టే పండంటి కొడుకు పుట్టాడు. బిడ్డకు మల్లు అని పేరు పెట్టారు.

రాష్ట్రంలోని ఇతర ప్రాంతాలలో వరి పంట దెబ్బ తినడంవల్ల, ఆ గ్రామం రైతుల నుంచి ఎక్కువ ధాన్యం కొనుగోలు చేయడానికి ప్రభుత్వం నిర్ణయించి, ఉత్తర్వులు జారీ చేసింది. పుల్లయ్యకు అది అన్యాయంగా తోచింది. ధాన్యం కొనడానికి వచ్చిన ప్రభుత్వ అధికారులకు అడ్డుపడ్డాడు. పోలీసులు వచ్చారు. పుల్లయ్య తిరగబడ్డాడు. పోలీసులు అతన్ని బంధించి పట్టుకుపోయారు.

పుల్లయ్య ఖైదు నుంచి బయటపడడానికి అతని భార్య నీలికి, ఆ గ్రామానికి చెందిన రాజు అనే ధనవంతుడు ధన సహాయం చేశాడు. అయితే, అతడు ఇచ్చిన డబ్బుకు అధిక వడ్డీలు లెక్కగట్టి, పుల్లయ్యకున్న కొద్ది పొలాన్ని రాబట్టుకున్నాడు. దుష్టుడైన ఆ ధనికుణ్ణి, మరేదో పగమీద అదే గ్రామానికి చెందిన ఒక గుడ్డి ముసలివాడు ఒకనాటి రాత్రి గాయపరచాడు. అయితే, అది పుల్లయ్యే చేయించాడని అతని మీద నిందారోపణ చేసి, అతన్ని ఖైదు చేయడానికి మళ్ళీ పోలీసులు వచ్చారు. ఈ గండం నుంచి గట్టెక్కడానికి తనకున్న, చిన్న ఇంటిని రాజుకు అమ్మేశాడు పుల్లయ్య!

ఉన్న పొలమూ, ఇల్లూ పోగొట్టుకున్న పుల్లయ్య, పొట్టచేత బట్టుకుని భార్యాపిల్లలతో పట్నం చేరాడు.



ఒకప్పుడు ముక్కుకు సూటిగా, ఎంతో నిజాయితీగా పదిమందిలో గౌరవంగా జీవించిన పుల్లయ్యకు కష్టాలు అరంభమయ్యాయి. అయినప్పటికీ, తనకు తోడుగా కట్టుకున్న భార్య, కన్న బిడ్డ ఉండడం చూసి కొంత ఊరట చెందాడు.

పట్నంలో జీవనోపాధి కోసం రకరకాలుగాప్రయత్నించాడు పుల్లయ్య. కాని, ప్రయోజనం కనిపించలేదు. భార్యా పిల్లలు ఆకలితో అలమటించసాగారు. ఆ సమయంలో పుల్లయ్యకు ఇద్దరు దొంగలతో పరిచయం కలిగింది. క్రమంగా పుల్లయ్య కూడా వాళ్ళలో ఒకడయ్యాడు.

ఒకనాటి రాత్రి ముగ్గురూ కలిసి ఒక ధనవంతుడి ఇంట్లో దొంగిలించడానికి వెళ్ళారు. అలికిడి విన్న ధనికుడు మేలుకుని, ఇద్దరు దొంగలు భవనం వెలుపల ఉన్న గొట్టాన్ని పట్టుకుని మేడ మీదికి ఎక్కడం చూసి, తుపాకీ తీసుకుని వాళ్ళకేసి గురి పెట్టాడు. ఆ లోగా వెనక నుంచి వచ్చిన పుల్లయ్య, ధనికుడి తలమీద బలంగా కొట్టాడు. తుపాకీ గురి తప్పింది. ముగ్గురు దొంగలూ తప్పించుకుని పారిపోయారు.

అయితే, ఆ రాత్రి పుల్లయ్యకు తెలియకుండా, అతని ముద్దుల కొడుకు మల్లు, తండ్రి వెనగ్గా వెళ్ళి, అతడు ఒక మేడ మెట్లు ఎక్కడం చూశాడు. తెల్లవారాక కూడా తండ్రి ఇంటికి రాకపోయే సరికి, ఆ పసివాడు తిన్నగా మేడ దగ్గరికి వెళ్ళి తన తండ్రిని చూడాలని ఏడ్వసాగాడు అమాయకంగా. పోలీసులు వచ్చారు. రాత్రి తన తండ్రి ఆ మేడమెట్లెక్కడం చూశానని చెప్పడంతోపాటు, తండ్రి ఇద్దరి స్నేహితుల పేర్లు కూడా చెప్పేశాడు మల్లు. ఆ తరవాత పోలీసులు ముగ్గురు దొంగలనూ సులభంగా పట్టేశారు. ఆ విధంగా తన కొడుకు దొంగలు పట్టడంలో నేర్పరి కావాలన్న పుల్లయ్య కల నిజమయింది!

అయితే, ఎన్ని కష్టాలు ఎదురయినప్పటికీ పుల్లయ్య భార్య నీలి మాత్రం గుండె నిబ్బరంతో, మంచి పట్ల అచంచలమైన విశ్వాసంతో చెక్కుచెదరకుండా నిలబడింది!

బలివాడ కాంతారావుగారి సుప్రసిద్ధ నవల 'దగాపడిన తమ్ముడు' కథ ఇది. తెలుగు గ్రామ జీవితాన్నీ, పుట్టి పెరిగిన గ్రామంలో బ్రతకలేక పట్నం చేరిన ఒక అమాయక యువకుడి కడగండ్లను కళ్ళకు కట్టినట్టు అద్భుతంగా వివరించే ఈ నవల ఇటీవలి కాలంలో వెలువడింది.. ఇది పలు భారతీయ భాషలలోకి అనువదించబడింది.

# మీకు తెలుసా?

1. ఉత్తర భారతదేశంలో పన్నెండేళ్ళకొకసారి జరుపుకునే ఉత్సవం ఏది?
2. మనిషి తలా, చేతులూ; గుర్రం శరీరమూగల వింత జంతువు ఏ పురాణంలో వస్తుందో తెలుసా?
3. సుప్రసిద్ధ ఖజురహో ఆలయాలు ఎక్కడ ఉన్నాయి?
4. డాన్యూబ్ నది ఒక తూర్పు ఐరోపా నగరం గుండా ప్రవహిస్తున్నది. ఆ నగరం ఏది?
5. చోళుల రాజధాని ఏది?
6. దక్షిణ ఆసియాలో ఒక దేశం ఎప్పుడుగాని పరదేశ పాలనలో లేదు. అది ఏది?
7. సముద్రంభూమి ఆధారంగా గల అతి ఎత్తయిన కొండ ఏది? ఎత్తు ఎంత?
8. గ్రీకు రాయబారి మెగస్తనీసును ఏ గ్రీకు రాజు మన దేశానికి పంపాడు? ఆయన ఏ రాజు ఆస్థానాన్ని అలంకరించాడు?
9. 'రాఫ్లేసియా' అనే పుష్పం ప్రత్యేకత ఏమిటి?
10. మామూలు ఈగ ఎన్నాళ్ళు బతుకుతుంది?
11. ఆఫ్రికాలో అతిపెద్ద సరస్సు ఏది?
12. మానవ కపాలంలో మొత్తం ఎన్ని ఎముకలు ఉన్నాయి?
13. పోర్చుగీసు నావికులు ఈనాటి శ్రీలంకలో అడుగుపెట్టినప్పుడు వాళ్ళు దానికి పెట్టిన పేరేమిటి?
14. హైందవ పురాణాలలో వానదేవుడి పేరేమిటి?
15. ఒక నియంత ప్రారంభంలో ఉపాధ్యాయుడుగానూ, పాత్రికేయుడుగానూ ఉండేవాడు. అతడు ఎవరు?
16. మొట్టమొదటి నోబెల్ శాంతి బహుమతిగ్రహీత ఎవరు?
17. శిక్కుల పవిత్ర గ్రంథం ఏది?
18. ఒక చెట్టు బెరడు నుంచి తీసే ద్రవం మలేరియాకు ఔషధంగా ఉపయోగపడుతుంది. ఆ చెట్టు ఏది?

## సమాధానాలు

1. కుంభమేళా.
2. గ్రీకు పురాణం.
3. మధ్యప్రదేశ్‌లో.
4. బుడాపెస్ట్; నదికి ఒక గట్టున బుడా, మరొకగట్టున పెస్ట్ ఉన్నవి.
5. తంజావూరు.
6. థాయిలాండ్.
7. హవాయిలోని మౌనాకీ. దీని ఎత్తు 32,000 అడుగులు. సముద్రమట్టానికి పైన 13,784 అడుగులు ఉన్నది.
8. గ్రీకు రాజు I సెల్యూకస్. చంద్రగుప్త మౌర్యుడి ఆస్థానం.
9. ప్రపంచంలోకెల్లా అతిపెద్ద పుష్పం; ఇండొనేషియాకు చెందినది.
10. నాలుగురోజులు.
11. ఉగాండా, కీన్యా, టాంజానియా మధ్య విస్తరించిన విక్టోరియా సరస్సు (27,000 చదరపు మైళ్ళు).
12. 29 ఎముకలు.
13. జీలాన్.
14. వరుణుడు.
15. ఇటలీకి చెందిన ముసోలినీ.
16. జీన్ హెన్రీ డ్యూనాంట్. రెడ్‌క్రాస్ సంస్థాపకుడు.
17. ఆదిగ్రంథ్ (గురుగ్రంథ్ సాహెబ్)
18. 'సింకోనా' చెట్టు.



# పిసినిగొట్టు డబ్బు

పూర్వం ఒక పట్టణంలో భద్రుడనే భాగ్యవంతుడుండేవాడు. అలాంటి పిసినారి పుట్టలేదు, పుట్టబోడు అని అంతా చెప్పుకునేవారు.

ఒకరోజున భద్రుడు కాలినడకనఎక్కడికో వెళుతూ, కాలుజారి పడ్డాడు. అప్పుడాయన చొక్కా జేబులోంచి రూపాయలు కింద పడ్డాయి. భద్రుడు చప్పున లేచి వాటిని ఏరుకున్నాడు. అయితే, ఒక్కటి తక్కువయింది. ఆయన కంగారుగా చుట్టుపక్కల వెదికాడు. కనబడలేదు.

భద్రుడు ఆ రూపాయి తనకు దొరక్కపోతే ఇంకెవరికైనా దొరుకుతుందేమోనని భయపడి, చాలాసేపు కాస్త దూరంగా నిలబడి కాపలాకాశాడు. ఆ దారిలో చాలామంది వెళ్ళారు కానీ ఎవరికీ అది దొరికినట్టు ఆయనకు తోచలేదు.

భద్రుడు హతాశుడై ఇల్లు చేరి, భార్యతో జరిగింది చెబితే ఆమె, "ఈ పట్నంలో ధర్మం నాలుగు పాదాల నడుస్తున్నదని, మీకూ తెలుసు. సాయంకాలం న్యాయాధికారి ఇంటికి వెళ్ళండి. మీ రూపాయి ఎవరికి దొరికితే వాళ్ళు దాన్ని ఆయనకు తప్పకుండా వప్పచెబుతారు," అన్నది.

ఈలోగా భద్రుడుపోగొట్టుకున్నరూపాయి దాపుల నున్న పొదల్లోకి చేరి, ఆ పొదలో పాములు పట్టబోయిన నాగన్న అనే వాడికి దొరికింది. ఏనాడూ లేనిది ఆ రూపాయి దొరగ్గానే వాడికి మద్యం పుచ్చుకోవాలనిపించింది. వాడు వెంటనే బయలుదేరి దుకాణానికి వెళ్ళాడు.

దుకాణం యజమాని వాణ్ణి చూసి, "ఏనాడూ లేంది, నువ్విటు వచ్చావేమిరా, నాగన్నా?"అని ఎంతో ఆశ్చర్యంగా పలకరించాడు.

"ఏమో! ఇం కు కొన్ని క్షణాల ముందు, ఈ పాడు బుద్ధ పుట్టి ది," అని నాగన్న,

"వసుంధర"



దుకాణం యజమానికి రూపాయి ఇచ్చి మద్యం పుచ్చుకుని వెళ్ళిపోయాడు.

అంతలో అటుగా భీముడనే వస్తాదు పోతూ, దుకాణం యజమానికి కనిపించాడు. యజమాని వాణ్ణి దగ్గిరకు పిలిచి రహస్యంగా, "మనిషన్న వాడికి శత్రువంటూ ఎవడో ఒకడుండక పోడు. ఎన్నడూ లేంది ఈ క్షణాన ఎందుకనో నాకు, రామాలయం పక్కింట్లో వుండే బంగారయ్య మీద పగ సాధించాలనిపిస్తున్నది. నువ్వు పోయి వాణ్ణి నాలుగు తంతానంటే, ఈ రూపాయిస్తాను," అన్నాడు.

భీముడికి వాళ్ళమీదా, వీళ్ళమీదాచెయ్యి చేసుకునే అలవాటు లేదు. న్యాయంగా కుస్తీలుపట్టి, పోటీకి వచ్చిన వాళ్ళను చిత్తు చేసి ఎంతో పేరు తెచ్చుకోవాలన్నది, వాడి తాపత్రయం. వాడు దుకాణం యజమాని చెప్పిన దానికి అయిష్టంగా తలపూప బోతున్నంతలో, యజమాని వాడి చేతిలో రూపాయి పెట్టాడు. భీముడు మారుపలక్కుండా పోయి, బంగారయ్యను నాలుగు తన్నాడు. బంగారయ్య ఏడుస్తూ, "అకారణంగా నన్ను తన్నావు. దేవుడు నిన్ను శిక్షిస్తాడులే!" అన్నాడు.

మొదటిసారిగా భీముడికి దేవుడంటే భయం కలిగింది. వాడు వెంటనే గుడికి వెళ్ళి పూజారి చేతిలో రూపాయి పెట్టి, "నా పాపాలన్నీ పోయేలా పూజ చెయ్యి," అని చెప్పి వెళ్ళిపోయాడు.

పూజారికి రూపాయి చేతిలో పడగానే, పక్కవీధిలో వున్న వసంత ఇంటికి వెళ్ళి ఆమెపాట వినాలనిపించింది. ఆమె మువ్వగోపాల పదాలు బాగా పాడుతుంది. డబ్బు ఇవ్వనిదే ఆమె ఎవరి ముందరా పాడదు. అందువల్ల, ఆయనవెంటనే గుడితలుపులు మూసి వసంత ఇంటికి వెళ్ళి, రూపాయి కాసు ఆమె చేతిలోపెట్టి తనకోరిక చెప్పాడు.

వసంత, పూజారి ముందు చక్కగా పాడి పంపేసింది. తర్వాత రూపాయి కాసుకోసం వెతికితే కనిపించలేదు. ఆమె ఇల్లంతా వెదికి విసిగి పోయాక పనిమనిషి గౌరిని అనుమానించింది.

సంగతి వసంత, తల్లికి చెబితే ఆమె, "వెంటనే న్యాయాధికారికి ఫిర్యాదు చెయ్యి. ఈరోజు రూపాయి దొంగిలించిన మనిషి, రేపు విలువైన నగలు కూడా దొంగిలించ గలదు," అని హెచ్చరించింది.

వసంత అప్పటికప్పుడే మరొక నౌకరు ద్వారా గౌరి గురించి న్యాయాధికారికి ఫిర్యాదు పంపింది.

ఆ రూపాయిని నిజంగానే గౌరి దొంగిలించింది. ఆనాటి వరకూ ఆమె దొంగతనం చేసి ఎరగదు. ఆ రూపాయి పెట్టి మంచి రవికగుడ్డ కొనుక్కోవాలనుకుని గౌరి బట్టల దుకాణానికి వెళ్ళింది. ఆ దుకాణానికి వసంత లేకుండా ఏనాడూ గౌరి ఒక్కర్తీ వెళ్ళలేదు. దీనితో దుకాణం వాడు అనుమానించి వసంత ఇంటికి కబురంపాడు. దొంగ దొరికిపోయింది!

ఆ సాయంత్రం న్యాయాధికారి, వసంతకు కబురుపంపి ఆమె వచ్చాక, "ఒక్కరూపాయి కోసం గౌరికి కారాగారశిక్ష విధించడం న్యాయం కాదు, నువ్వామెను పనిలోంచి తీసెయ్యి, సరిపోతుంది," అన్నాడు.

"ఆ రూపాయి నాకెంతో విలువైనది. ఎన్నడూ లేనిది గుడి పూజారి నా పాట వినడానికి వచ్చి, ఆ రూపాయి ఇచ్చి వెళ్ళాడు," అన్నది వసంత. న్యాయాధికారి ఆశ్చర్యపోయి, "ఆఁ, ఏమిటేమిటీ! ఇంతకాలానికి ముసలి ఆదిశేషాచారికి మువ్వగోపాల పదాలు వినాలన్న బుద్ధి పుట్టిందా?" అని నౌకరును పంపి పూజారిని రప్పించాడు.



పూజారి వచ్చి, ఆ రూపాయి వస్తాదు భీముడిచ్చాడని జరిగిందంతా చెప్పి, "ఆ రూపాయిలో మంత్రమో,తంత్రమోవున్నది!" అంటూ చేతులు జోడించాడు.

అలా అలా కథ పాములు పట్టే నాగన్న వరకూ నడిచాక, ఆ రూపాయి ఎవరిదై వుంటుందా అని, న్యాయాధికారి దీర్ఘాలోచనలో మునిగివుండగా, అక్కడికి భద్రుడు, పేదరైతొకడు వచ్చారు. ఇద్దరూ ఆ రోజున చెరొక రూపాయీ పోగొట్టుకున్నారు. పేద రైతు రెక్కలు ముక్కలు చేసుకుని సంపాయించిన రూపాయిపోయిందని ఏడ్చేశాడు.

న్యాయాధికారి, పేదరైతు వంక జాలిగా చూసి, "నువ్వు చాలా దురదృష్టవంతుడివి. నా దగ్గర ఒక రూపాయి చేరింది. అయితే, అది నువ్వు పోగొట్టుకున్నది కాదు. భద్రుడిదారూపాయి!" అని తన వద్ద వున్న రూపాయిని భద్రుడికిచ్చేశాడు.

"అయ్యా! అది నా రూపాయి కాదనీ, భద్రుడిదనీ ఎలా నిర్ణయించారు?" అని పేదరైతు విచారంగా అడిగాడు.

న్యాయాధికారి నవ్వి, "భద్రుడి గురించి ఈ ఊళ్ళో తెలియని దెవరికి? అయన డబ్బును తన వద్ద బందీగా వుంచుతాడు. అయన బారి నుంచి తప్పించుకున్న రూపాయి ఖైదు బతుక్కు విసిగి పోయి స్వేచ్ఛను కోరుకుంటున్నది. అందుకే అది ఎవరి వద్దా స్థిరంగా వుండక చేతులు మారుతూ తన సరదా తీర్చుకుంటున్నది. ఆ రూపాయికి స్వేచ్ఛపట్ల గాఢమైన కోరిక వుండడం వల్ల, అది చేరిన వారికి దుర్బుద్ధి పుడుతూ వచ్చింది. ఆ రూపాయి మరి భద్రుడిది కాక పేదరైతుదెందుకవుతుంది?" అన్నాడు.

అక్కడున్న వాళ్ళందరూ న్యాయాధికారి తీర్పుకు నవ్వారు. భద్రుడు మాత్రం ఆ తీర్పులోని సందేశాన్ని అర్థం చేసుకుని, ఆ రూపాయిని పేదరైతుకే విడిచి పెట్టాడు. అంతేకాక, ఆ రోజు నుంచీ ఆయన తన వద్ద వున్న డబ్బును ఇంట్లోబందీగా వుంచక సత్కార్యాలకు వినియోగిస్తూ మంచి పేరు తెచ్చుకున్నాడు.





# శరభన్న సలహా - లింగన్న వైద్యం

జొన్నాడ అనే గ్రామంలో, శరభన్న అనే పురోహితుడుండేవాడు. ఆయనకు ఒక్కతే కూతురు: అందుచేత ఏ దిక్కూ మొక్కూ లేని మేనల్లుడు లింగన్న అనే అతణ్ణి చేర దీసి పెంచాడు. శరభన్న, లింగన్నను రోజూ తన వెంట తీసుకువెలుతూ పౌరోహిత్యం నేర్పేవాడు.

ఇలా వుండగా— ఒకనాడు శరభన్నకు పాత పంచాంగాలతో పని బడింది. ఆయన తాతలనాటి నుంచి కట్టకట్టి అటక మీద పెట్టిన పంచాంగాలను కిందికి దించాడు.

తర్వాత పంచాంగాల దుమ్ము దులిపి, ఒకటొక్కటే పరిశీలించసాగాడు శరభన్న. ఆ సమయంలోపంచాంగాలకట్టలో ఆయనకు పురాతన ఆయుర్వేద గ్రంథమొకటి కని పించింది. అందులో అనేక వ్యాధులకు, అందరికీ తెలిసి అందుబాటులో వుండే మూలికల వైద్యవిధానం రాసి వుంది. ఆ గ్రంథాన్ని శరభన్న, తన భార్యకు ఆసక్తిగా చూపాడు.

శరభన్న భార్య ఆ గ్రంథం చూసి చాలా సంబర పడి, "అలా అని అంతగా నమ్మం గాని, దేవుడు చాలా మంచివాడు! ఆయన మంచితనం, మన అదృష్టం కలిసొచ్చి, మనకీ గ్రంథం దొరికింది. రేపటి నుంచీ మీరొక పని చెయ్యండి. మంచం పట్టి కాస్త అటూ ఇటూగా వున్నవాళ్ళకు గ్రంథంలో చెప్పినట్టు మందివ్వండి. బతికాడా మీకు వైద్యకట్నం! కాదూ, మీరు పురోహితులు గనక గోదానం వస్తుంది. అటూఇటూ, ఇటూ అటూ అయినా మనకే మేలు. ఏ మాత్రం నష్టం అన్నమాటలేని, బహుమేలైన వృత్తి!" అన్నది.

శరభన్నకు భార్య సలహా నచ్చింది. అయితే, ఇన్నేళ్ళుగా లేనిది హఠాత్తుగా వైద్యం ప్రారంభిస్తే జనం నమ్మరు. అందు

జె. ఉదయనాగశిరీష



చేత, ఆ పనేదో తన మేనల్లుడు లింగన్న చేత చేయించాలనుకున్నాడు.

తొందరలోనే శరభన్న సలహాలతో లింగన్న చిన్న వైద్యుడుగా మారిపోయాడు. తలనొప్పి, గజ్జి, తామర వంటి చిన్న చిన్న రోగాలకు, మామ పుస్తకంలో చూసి చెప్పి నట్లుగా మూలికలు తెచ్చి లింగన్న వైద్యం చేసేవాడు. కాని, ఊళ్ళో పేరు మోసిన వైద్యుడున్న కారణంగా, పెద్ద పెద్ద రోగా లకు, మేనల్లుడికి చిట్కాలు చెప్పే సాహసం చెయ్యలేకపోయాడు శరభన్న.

ఒకరోజున శరభన్న, లింగన్న పొరు గూళ్ళో పెళ్ళి చేయించి తిరిగొస్తున్నారు. దారిలో వాళ్ళకు గ్రామాధికారి పాలేరు ఎదురు పడి, "అయ్యా! మన గ్రామాధికారి, మాటా పలుకూ లేకుండా పడిపోయాడు. సమయా నికి వైద్యుడు గరుడాచారిగారు ఇంటలేరు. అయ్యగారిని చూసి ఊరి పెద్దలందరూ ఆయన చివరి ఘడియల్లో ఉన్నాడంటు న్నారు. లింగన్నగారేమైనా రక్షించగలరేమో అని, అమ్మగారి ఆశ. మీ కోసం కాలుకాలిన పిల్లిలా, ఎప్పుడొస్తారా అని ఊరూ పొలిమేరా అంతా గాలిస్తున్నాను," అన్నాడు.

జరిగిందేమంటే– గ్రామాధికారి భోజనం చేసి పొలం వచ్చాడు. పాలేరు చెట్టునే ముగ్గిపోయినమామిడిపండొకటిస్తేతిన్నాడు. దాహంగా వుందని కొబ్బరి బొండాం నీళ్ళు తాగాడు. రెండు రోజుల క్రితం దక్షిణ పొలంలో వేపచెట్టుకు పట్టిన తేనె పట్టు నుండి పిండిన తేనె, ఎలా వుంటుందో రుచి చూశాడు. ఆ తర్వాత ఏదైనా తిన్నా, తాగినా వెంటనే అలవాటుగా వేసుకునే తమలపాకులు వేసుకున్నాడు. కొంచెం సేపటికి నోట మాటలేక గుడ్లు తేలవేసి పడిపోతే, పాలేరు మరికొందరి సహాయంతో ఆయన్ను ఇంటికి చేర్చాడు.

పాలేరును మాటల్లో పెట్టి, విషయ మంతా తెలుసుకున్న శరభన్న, ఇంటికి వెళ్ళగానే గ్రంథం తిరగేసి– మామిడి, కొబ్బరి బొండాం, తేనె పుచ్చుకున్న తర్వాత, కనీసం ఒక గంటసేపన్నా ఆగకుండా తాంబూలం సేవిస్తే, విషప్రయోగమంత ప్రమాదమవు

తుందని తెలుసుకున్నాడు. దానికి విరుగుడు దిరిసెన చెట్టు వేరు, ఆకు, బెరడు, పువ్వు, కాయ చూర్ణం చేసి ఇవ్వడమే!

వెంటనే శరభన్న, లింగన్న సాయంతో దిరిసెన పంచచూర్ణాన్ని తయారుచేశాడు.

పని పూర్తయ్యాక శరభన్న, లింగన్నతో, "లాభం గల కాలమైతే గురుడు ఏకాదశ ముందున్నాడంటారు. నీ కాలం బాగుంది! నాతో బాటురా, ఈ మందు గ్రామాధికారికిచ్చి, గ్రామంలో పేరు ప్రఖ్యాతులు తెచ్చుకో," అన్నాడు.

శరభన్న, లింగన్న గ్రామాధికారి ఇంటికి వెళ్ళారు. ఇంటి నిండా జనం. గ్రామాధికారి మంచం మీద గుడ్లు తేలేసి ఆయాసపడుతున్నాడు. లింగన్న దిరిసెన చూర్ణం పట్టుకుని మెల్లగా గ్రామాధికారిని సమీపించాడు. అప్పుడు, ఊళ్ళో అందరూ శకునాల సూరన్న అనిపిలిచే ముసలాయన, గొంతు గట్టిగా సవరించుకుని, "ఘన వైద్యుడు గరుడాచారిగారు ఊళ్ళోలేనందున, ఆయన చేయవలసిన వైద్యం, ఈ కుర్రలింగన్నగారి చేత బడింది. మామ శరభన్నగారు కూడా వెంట వున్నారు గనక, అచ్చైతే వైద్యకల్పం, ఇచ్చైతే కపిలగోదానం! ఏమైనా ఆయుషున్నవాడి మీద యముడి విషప్రయోగమైనా పని చెయ్యదు," అన్నాడు.

ఆ మాటలకు లింగన్న, శకునాల సూరన్నకేసి కోపంగా చూసి, గ్రామాధికారి నోటిని బలవంతంగా తెరిచి, దిరిసెన చూర్ణం నోటిలో వేసి, నీళ్ళు పోసి గుటకపడేలా



చూశాడు. కొంచెం సేపట్లో గ్రామాధికారి ఆయాసం తగ్గింది. మరి కొద్ది క్షణాల్లో ఆయన మంచం మీద లేచి కూర్చున్నాడు.

దీనితో వైద్యుడుగా లింగన్న పేరు గ్రామ మంతా మారుమోగిపోయింది. ధన్వంతరి మారువేషంలో వచ్చాడని, లింగన్నను అందరూ పొగిడారు. గ్రామాధికారి శరభన్ననూ, లింగన్ననూ ఘనంగా డబ్బిచ్చి సత్కరించాడు.

గ్రామాధికారి జబ్బూ, లింగన్న చేసిన వైద్యం ఆ నోటా, ఆ నోటా పడి జమీందారు గారి ఆస్థాన వైద్యుడి చెవిని పడింది. ఒక అనుభవం లేని వాడు, అంత గొప్ప వైద్యం చేయగలిగాడంటే—అతడికేదో అద్భుతవైద్య గ్రంథం దొరికుండాలని ఊహించాడు, ఆస్థానవైద్యుడు.

ఆయన లింగన్నకు కబురు చేసి పిలి పించి, నయానా భయానా మాటలలో పెట్టి, తన ఊహ సరైనదేనని గ్రహించాడు.

అప్పుడాయన లింగన్నతో, "నాయనా! ఏ విద్య అయినా, గురువుల శుశ్రూషలో పట్టు దలగా అభ్యసించితే తప్ప, లేకపోతే రాణిం చదు. నీ దగ్గిరవున్న అద్భుత గ్రంథంలోని వైద్యవిధానం, అనుభవవైద్యమే, కాదనను, కాని అది అన్నివేళలా మంచి చెయ్యదు. ఎప్పుడైనా వికటించవచ్చు. నేను నీకు శాస్త్రీయ పద్ధతిలో వైద్యం నేర్పుతాను. అయితే, నా దగ్గిర విద్య పూర్తయ్యాకే, ఆ గ్రంథాన్ని ఉపయోగిస్తానని ముందుగా నాకు మాట ఇవ్వాలి!" అన్నాడు.

ఆస్థాన వైద్యుడి మాటలు లింగన్నకు సమంజసంగా తోచాయి. అతడు, ఆస్థాన వైద్యుడి వద్ద కొంతకాలం శిక్షణ పొంది, జమీందారుగారి అధికార ముద్రతో అర్హత గల వైద్యుడయ్యాడు.

ఆ తర్వాత లింగన్న శరభన్న కూతురును పెళ్ళాడి, అక్కడే వుంటూ, శాస్త్రీయంగా నేర్చిన వైద్యవిద్యకు తోడుగా, అటకమీద దొరికిన అద్భుత గ్రంథాన్ని కూడా ఉపయో గించుకుంటూ జొన్నాడలోనే కాకుండా చుట్టుపక్కల గ్రామాల్లో కూడా మంచి పేరు తెచ్చుకున్నాడు.






రామ రావణ యుద్ధం చూడ వచ్చిన దేవతలూ, యక్షులూ, కిన్నరులూ, కింపురుషులూ, గంధర్వులూ రాముడి పరాక్రమం గురించీ, వానరులు చేసిన భయంకర యుద్ధం గురించీ గొప్పగా మాట్లాడుకుంటూ, తమ తమ ప్రదేశాలకు సంతోషంగా వెళ్ళిపోయారు.

ఆ తరవాత రాముడు, మాతలిని గౌరవించి, అతణ్ణి ఇంద్రుడి రథంతో సహా స్వర్గానికి పంపేశాడు.

ఆ పిమ్మట లక్ష్మణుణ్ణీ, సుగ్రీవుణ్ణీ వెంటబెట్టుకుని రాముడు తన శిబిరానికి వెళ్ళాడు. అక్కడ లక్ష్మణుడితో, "లక్ష్మణా! మనం ఇప్పుడు విభీషణుణ్ణి లంకా రాజ్యాభిషిక్తుణ్ణి చెయ్యాలి. అందుకవసరం అయిన ఏర్పాట్లు త్వరగా చేయించు," అన్నాడు.

లక్ష్మణుడు, వానరులకు సువర్ణ కలశాలిచ్చి, వాళ్ళచేత సముద్ర జలం తెప్పించాడు. అతను స్వయంగా విభీషణుణ్ణి తీసుకుపోయి సింహాసనం మీద కూర్చోబెట్టి, సముద్రజలంతో అభిషేకించాడు. విభీషణుడి మంత్రులూ, అతనిపట్ల భక్తి గల రాక్షసులూ ఆనందంతో జయజయ ధ్వానాలు చేశారు. ఆ సమయంలో విభీషణుడు తాను పరిపాలించనున్న రాక్షసుల భయం పోగొట్టి, ఇక నుంచి లంకానగరం సుఖశాంతులతో తులతూగగలదని వాగ్దానం చేశాడు. రాక్షస పౌరులు అతడికి విలువయిన కానుకలు సమర్పించారు. విభీష

36. విభీషణ పట్టాభిషేకం



ణుడు కృతజ్ఞతా సూచకంగా రామలక్ష్మణు లకు దివ్యమైన అనేక వస్తువులను కాను కలుగా ఇచ్చాడు.

విభీషణుడు తన కోరిక ఈడేరినందుకు కృతజ్ఞతా భావంతో ఇచ్చిన కానుకల మీద ఏమాత్రమూ మనసు లేకపోయినప్పటికీ, రాముడు విభీషణుడి తృప్తి కోసం వాట న్నిటినీ చిరునవ్వుతో స్వీకరించాడు.

తరవాత రాముడు తన సమీపంలో చేతులు జోడించి, మహాపర్వతంలాగా ఎంతో గంభీరంగా నిలబడి ఉన్న హను మంతుడితో, "రాక్షస రాజైన ఈ విభీషణుడి అనుమతితో నువ్వు లంకానగరానికి వెళ్ళి, రావణుడి ఇంట ఉన్న సీతకు విజయాభి వందనం తెలిపి, నా చేత రావణుడు చచ్చాడనీ, నేను లక్ష్మణ సుగ్రీవుల వెంట ఉన్నాననీ చెప్పు. ఈ శుభవార్త ఆమెకు చెప్పి, ఆమె సంగతి సమాచారం తెలుసు కుని వెంటనే బయలుదేరి తిరిగి రా," అన్నాడు.

ఆ ప్రకారమే హనుమంతుడు దారి పొడు గునా రాక్షసుల మర్యాదలు అందుకుంటూ లంకానగరం ప్రవేశించాడు.

అతను రావణుడి మందిర ప్రాంగణానికి వెళ్ళి, ఒక చెట్టు కింద రాక్షస స్త్రీల నడుమ విచారంగా కూర్చుని ఉన్న సీతను చూశాడు.

అతను దగ్గరికి వచ్చి, తన పేరు చెప్పు కుని నమస్కారం చేసి, చేతులు కట్టుకుని నిలబడగానే సీత ముందు గుర్తు పట్టలేదు గాని, తరవాత జ్ఞాపకం వచ్చి, ఆనందం చెందింది. ఆమెలో మార్పు గమనించి హనుమంతుడు, రాముడు చెప్పమన్న మాటలు ఇలా చెప్పాడు:

"సీతాదేవీ, రాముడు క్షేమంగా ఉన్నాడు. ఆయన విభీషణ, సుగ్రీవుల వెంట వానర సేన మధ్య ఉన్నాడు. తాను శత్రువును వధించి, తన ఆశయం నెరవేర్చుకుని క్షేమంగా ఉన్నానని నీతో చెప్పమన్నాడు. రాముడు రావణుణ్ణి చంపడానికి విభీష ణుడి సహాయమూ, వానర వీరుల పరా క్రమమూ, లక్ష్మణుడి అచంచలమైన నీతి

బలమూ తోడ్పడ్డాయి. రాముడు నీ క్షేమం అడిగి, నీతో తన మాటగా ఇలా చెప్ప మన్నాడు: 'నీకు శుభవార్త తెలియజేసి, సంతోషం కలిగిస్తాను. పాతివ్రత్య ధర్మం తెలిసిన నువ్వు, నా అదృష్టం కొద్దీ ప్రాణా లతో ఉన్నావు. నా పరాక్రమం వల్ల విజయం కలిగింది గనక, ఇక నువ్వు నిశ్చింతగా ఉండు. విచారం మాను. రావ ణుడు చచ్చాడు. లంకానగరం మన వశమ యింది. నేను దృఢనిశ్చయంతో సముద్రా నికి సేతువు గట్టి, రావణుణ్ణి చంపుతానన్న శపథం నిలబెట్టుకున్నాను. లంక ఇప్పుడు విభీషణుడి ఆధీనంలో ఉన్నది. నువ్వు రావణుడి ఇంట ఉన్నందుకు భయపడ నవసరంలేదు. అది ఇప్పుడు నీ ఇల్లే. నిన్ను చూడటానికి త్వరలో విభీషణుడు రాబో తున్నాడు."



ఈ మాటలు విని సీత ఆనందాతిరేకంతో లేచి నిలబడింది. కాని ఏమీ జవాబు చెప్ప లేకపోయింది. ఏదో ఆలోచిస్తూ మౌనం వహించింది.

అది చూసి హనుమంతుడు, "దేవీ, ఏమిటి ఆలోచిస్తున్నావు? నేనన్నదానికి ఏమీ జవాబు చెప్పవేం. ఎందుకీ మౌనం?" అని అడిగాడు.

సీత వణుకుతున్న గొంతుతో, "నా భర్త విజయవార్త నీ నోట విని, ఆనందం పట్టలేక నాకు నోట మాట రాలేదు. ఇలాటి ప్రియమైన వార్త తెచ్చినందుకు నిన్ను అభి నందించటానికి, ఎంత ఆలోచించినా, మాటలు తట్టటం లేదు. నీకు బహుమానం ఇద్దామంటే అందుకు తగిన వస్తువు మూడు లోకాలలోనూ కనబడదు," అన్నది.

హనుమంతుడు ఆమెకు నమస్కరించి, "ఈ మాట మరొకరు అనలేరు. నీ భర్త విజయం కోరిన నీకే చెల్లింది! నీ మాటలే నాకు ఉత్తమోత్తమమైన బహుమానం. రావణుణ్ణి చంపిన రాముణ్ణి చూస్తేనే నాకు ఇంద్రపదవి లభించినంత సంతోషం కలి గింది," అన్నాడు.

సీత కూడా హనుమంతుణ్ణి ప్రశం సించింది. హనుమంతుడు ఆమెతో,

గానూ కష్టాలు అనుభవించాననుకోవాలి. అందుచేత నాకు ఈ రాక్షస స్త్రీల మీద ఎలాటి కోపమూ లేదు. రావణుడు చచ్చాడు గనక, వీళ్ళు నన్ను ఇప్పుడేమీ చేయలేరు. ఒకవేళ ఈ రాక్షసస్త్రీలు తమ దుర్బుద్ధి కొద్దీ నన్ను కావాలనే బాధించారే అనుకున్నా వారిని శిక్షించటం యుక్తం కాదు," అన్నది.

హనుమంతుడు సీత మాటలను ఎంత గానో మెచ్చుకుని, "నువ్వు అన్నివిధాలా రాముడికి తగిన భార్యవు. అతనికి ఏం చెప్పమంటావో చెప్పి, నన్ను పంపించు," అన్నాడు.

"నాకు నా భర్త అయిన రాముణ్ణి చూడాలని ఉన్నది," అన్నది సీత.



"నువ్వు ఒప్పుకుంటే, నిన్ను క్రూరంగా చూసిన రాక్షస స్త్రీలనందరినీ చంపెయ్యాలని నాకు కోరికగా ఉన్నది," అన్నాడు.

తలుచుకున్న కొద్దీ అతనికి ఆ రాక్షస స్త్రీలను అప్పటికప్పుడే చిత్రవధ చెయ్యాలని ఉన్నది.

సీత ఆ సంగతి గ్రహించి హనుమంతుడితో, "ఈ రాక్షస స్త్రీలు రావణుడి దాసీలు. రాజును సేవించుకుని బతికే వాళ్ళు. రాజాజ్ఞ పాలించాలి గద! అలా చెయ్యకపోతే వాళ్ళు శిక్ష పొందరా? అందుచేత వారి మీద కోపగించటం అక్రమం. నా గ్రహచారం బాగులేకనూ, నేను పూర్వజన్మలో చేసుకున్న పాపాలకు ఫలితం

ఆ సందేశం తీసుకుని హనుమంతుడు అతివేగంగా రాముడి వద్దకు వచ్చేశాడు. అతను రాముడితో, "ఎవరి కోసం సేతువు కట్టి, ఇంత భయంకర యుద్ధం చేశామో, ఆ సీతను చూశాను. ఆమె నన్ను గుర్తించింది. మనకు విజయం లభించిందంటే చాలా సంతోషించింది. రావణాసురుణ్ణి హతమార్చిన రాముణ్ణీ, లక్ష్మణుణ్ణీ త్వరగా చూడాలని ఉన్నదని చెప్పింది," అన్నాడు.

ఈ మాట విని రాముడు కంట తడిపెట్టి, కొంతసేపు మౌనంగా ఊరుకుని, "అంత కాలం రావణుడి ఇంట ఉండిన సీతను స్వీకరించానంటే లోకం నన్ను ఆడి



పోస్తుంది; నిర్దోషి అయిన సీతను త్యజించా నంటే పాపం చుట్టుకుంటుంది. ఏం చేసే టట్టు?" అన్నాడు.

అతను వేడి నిట్టూర్పులు విడుస్తూ, సమీపంలోనే ఉన్న విభీషణుడితో, "నువ్వు వెళ్ళి, సీత చేత పరిమళజలాలతో అభ్యంగనస్నానం చేయించి, శరీరమంతా మంచి పూతలు పూయించి, చక్కగా నగలతో అలంకరించి ఇక్కడికి తీసుకురా," అన్నాడు.

విభీషణుడు వెంటనే లంకానగరానికి వెళ్ళి, తన అంతఃపుర స్త్రీల చేత సీతకు కబురు చేయించి, ఆమెను చక్కగా స్నానం చేసి, అలంకరించుకుని రమ్మనీ, ఆమెను ఆమెభర్తచూడగోరుతున్నాడనీచెప్పించాడు.

తాను తన భర్తను ఉన్నపాళంగానే చూడ గోరుతున్నానని సీత విభీషణుడికి తెలిపింది. అలా కాదు, రాముడు కోరినట్టుగానే చెయ్యాలన్నాడు విభీషణుడు. సీత అందుకు సరేనన్నది.

విభీషణుడు సీత చేత తలంటి స్నానం చేయించి, శరీరానికి అంగరాగాలు పూయించి, సమస్త మైన ఆభరణాలతో అలంకరించి, దివ్యమైన బట్టలు కట్టించి, పల్లకీలో ఎక్కించి, అనేకమంది రాక్షసులను ఆమెకు తోడు ఇచ్చి, రాముడి వద్దకు చేర్చాడు.

విభీషణుడు రాముడితో, "తమ ఆజ్ఞానుసారం సీతను తెచ్చాను," అని చెప్పినప్పుడు రాముడు, ఆ సంగతి ముందుగా తెలిసి కూడా విచారంగా కూర్చుని ఉన్నాడు. అతన్ని ఒకేసారి మూడురకాల భావాలు పట్టి పీడించాయి; ఇంత కాలానికి సీత మళ్ళీ కనిపిస్తున్నదన్న సంతోషమూ, ఆమెను ఎలా విసర్జించటమూ అన్న తీవ్ర విచారమూ, అంతకాలం రాక్షసుడి ఇంట ఉన్న దాన్ని ఎలా ఏలుకోవటమా అన్న రోషమూనూ!

రాముడు ఆలోచించి, విభీషణుడితో, "సీతను నాఎదుటకు తీసుకురా," అన్నాడు.

విభీషణుడు వేత్రహస్తుల చేత అక్కడ మూగి ఉన్న వానర, భల్లూకాలను దూరంగా తోలించాడు. రాముడది చూసి, వాళ్ళను



తరమవద్దని వారించి, "వీళ్ళు పరాయి వాళ్లు కారు. నా వాళ్లే, ఎందుకిలా మందలను తోలినట్టు తోలిస్తున్నావు? సీతను వీళ్లు కూడా చూడడంలో తప్పేమిటి?" అన్నాడు.

విభీషణుడు పశ్చాత్తాపపడుతూ, సీతను రాముడి వద్దకు తెచ్చాడు.

రాముడి మాటలు వింటున్న లక్ష్మణుడికీ, సుగ్రీవుడికీ, ఆయనలో సీత మీద ప్రేమ అన్నది ఉన్నట్టు తోచక, బాధ కలిగింది. రాముడి వాలకం చూస్తుంటే వారికి భయంకరంగా తోచింది.

సీత సిగ్గుతో ముడుచుకు పోతూ విభీషణుడి వెంట రాముడి ఎదటికి వచ్చింది. అంతమంది మధ్య ఉండటం చేత ఆమె చెంగు ముఖానికి అడ్డం పెట్టుకుని, "ఆర్య పుత్రా!" అని ఏడవనారంభించింది. అదే సమయంలో ఆమెకు, ఇంతకాలానికి తిరిగి తన భర్త కనిపించాడన్న సంతోషం కూడా కలిగింది. ఆమె దుఃఖం క్రమంగా కొంత సేపటికి ఉపశమించింది.

రాముడికి మాత్రం సీతను చూడగానే ముందు కోపం పుట్టుకొచ్చింది. అతను ఇలా అన్నాడు: "సీతా, యుద్ధంలో శత్రువును వధించి నిన్ను విడిపించి, నా పౌరుషం నిరూపించుకున్నాను. శత్రువు పొగరు అణచి, వాడు నాకు చేసిన అవమానానికి ప్రతిక్రియ చేశాను. నా ప్రయత్నంనెరవేరింది. నా శపథం నుంచి నాకు విముక్తి లభించింది. రావణుడు నిన్ను ఎత్తుకు పోయిన కారణం చేత నాకు కలిగిన అవమానాన్ని వాణ్ణి పరివారంతో సహా సంహరించి కడిగేసుకున్నాను. హనుమంతుడు సముద్రాన్ని దాటటమూ, లంకను దహించటమూ, ఇంకా అతను చేసిన అనేక ఘన కార్యాలు ఇప్పుడు సఫలమయ్యాయి. అలాగే యుద్ధంలో సుగ్రీవుడు నాకు చేసిన సహాయం సఫలమయింది. నన్నే నమ్ముకుని, నాతో చేరిన విభీషణుడి శ్రమ కూడా ఇప్పుడే సఫలమయింది."

రాముడు తనను గురించి ఒక్కమాట అనకపోవటం చూసి సీతకు దుఃఖం ఆగ

లేదు. ఆమె దుఃఖం చూసిన కొద్దీ, రాముడికి కోపం హెచ్చిపోయింది. అతను ముఖం చిట్లించి, "సీతా, అవమానానికి గురి అయిన వాడు, చేయ దగినదంతా చేశాను. కాని ఇదంతా నేను నీ కోసం చేయ లేదని గ్రహించు. సదాచారం రీత్యా నువ్వు నాకు విరుద్ధమైన మనిషివి. అందుచేత నేను అనుమతిస్తున్నాను. నువ్వు నీ ఇష్టం వచ్చిన చోటికి వెళ్ళవచ్చు. నాకు నువ్వు అవసరం లేదు. చాలాకాలం పరపురుషుడి ఇంట ఉన్న స్త్రీని పరాక్రమమూ, అభి మానమూ గలవాడు ఎలా స్వీకరిస్తాడు? నువ్వు రావణుడి ఇంట నుంచి దిగివచ్చిన దానవు! రావణుడి కళ్ళను నీ అందంతో ఆనందింప చేసిన దానవు! అటువంటి నిన్ను గొప్ప వంశంలో పుట్టి, ఆ వంశానికి కీర్తి తీసుకురావలసిన నేను ఎలా ఏలుకో గలను? నాకు నీ మీద భ్రమ ఏమీ లేదు. నీ ఇష్టం వచ్చిన చోటికి నువ్వు వెళ్ళవచ్చు. నేనీమాట బాగా ఆలోచించి మరీ చెబు తున్నాను. కావాలంటే ఒక పని చెయ్యి. నీ జరుగుబాటు కోసం లక్ష్మణుడి దగ్గిర ఉండు. లేదా భరతుడి దగ్గిర ఉండు. సుగ్రీవుడి వద్ద గాని, విభీషణుడి వద్దగాని ఉండు. నీకు ఎక్కడ సుఖంగా ఉంటుం దని తోస్తే అక్కడే ఉండు. శత్రువులను సమూలంగా నాశనం చేసి నిన్ను వారి నుంచి రక్షించి, నా క్షత్రియ ధర్మాన్ని నెరవేర్చాను. అంతేగాని, నిన్ను నేను మళ్ళీ చేరదీసి ఆశ్రయం ఇవ్వజాలను," అన్నాడు మహాపరుషంగా.

ఎన్నడూ అలాటి మాటలు అనిపించు కోని సీత, హతాశురాలయింది. ఎవరూ వినదగని కటువైన మాటలు రాముడి నోట రావటమూ; తాను ఇంత కాలమూ యమ చెర అనుభవించి, తన భర్త నోటి నుంచి ప్రియమైన మాటలు చెవిన పడతాయని ఎంతో ఆశించే సమయంలో ఇలాటి మాటలు వినపడటమూ చూసి, దిగ్భ్రాంతి చెందింది. కత్తితో నరికిన లత లాగా ఒక్క క్షణం కంపించి పోయి, కన్నీరు కార్చ సాగింది.



# ప్రవేశం ఉచితం!

హేలాపురిలో విశ్వేశ్వరుడనే ఆయనది పేరు పొందిన నాటక కళాసమితి. అయితే, క్రమంగా ప్రజలు రుసుము చెల్లించి నాటక ప్రదర్శన చూడడానికి రావడం తగ్గిపోయింది. ఈ స్థితిలో విశ్వేశ్వరుడు 'పారిజాతాపహరణం' అనే నాటకాన్ని రచించి, దాని ప్రదర్శనకు అయ్యే ఖర్చుల గురించి, తన మిత్రుడైన సుదర్శనుడితో చెప్పాడు.

సుదర్శనుడు, విశ్వేశ్వరుడికి ప్రదర్శన ఖర్చులకు గాను కొంత డబ్బిచ్చి, "వచ్చే శుక్రవారం రాత్రి నాటక ప్రదర్శనకు ఏర్పాటు చెయ్యి," అని చెప్పాడు.

ఈ లోపల సుదర్శనుడు, 'పారిజాతాపహరణం అనే అద్భుత నాటక ప్రదర్శన! ప్రవేశం ఉచితం!' అని ప్రచారం చేయించాడు.

నాటకం రోజున ప్రదర్శనశాల జనంతో క్రిక్కిరిసిపోయింది. ప్రదర్శన ముగిశాక జనం, నాటకాన్ని గొప్పగా పొగుడుతూ బయటికి వెళ్ళబోయేంతలో ద్వారాల దగ్గిర సుదర్శనుడు వుంచిన వాళ్ళు రుసుం చెల్లించమన్నారు.

"ఇది దురన్యాయం! ప్రవేశం ఉచితం అని ప్రకటించారు గదా?" అన్నారు ప్రేక్షకులు.

"అవును, ఉచితం ప్రవేశం మాత్రమే! నిష్క్రమణకు రుసుం చెల్లించాలి!" అన్నారు, సుదర్శనుడి మనుషులు. చేసేది లేక ప్రేక్షకులు రుసుం చెల్లించి బయట పడ్డారు.

— కోనే నాగవెంకట ఆంజనేయులు







# మాయ చిత్తరువు

చాలాకాలం క్రితం రాజపుత్రస్థానంలో జయ సింహుడనే రాజుండేవాడు. ఆయనకు చిత్ర లేఖనంపైన చాలాప్రీతి. ఆయన ఆస్థానంలో ఒక గొప్ప చిత్రకారు డుండేవాడు. జయ సింహుడు తన చిత్తరువును వేయించు కుందామనుకుంటూండగా ఆ చిత్రకారుడు అకస్మాత్తుగా చనిపోయాడు. ఆనాడు మొదలు దర్బారులో ఆ చిత్రకారుడి ఆసనం ఖాళీగానే ఉండిపోయింది.

ఇలా ఉండగా హిమాలయ ప్రాంతం నుంచి హేమచంద్రుడనే పేద చిత్రకారు డొకడు రాజపుత్రస్థానానికి వచ్చాడు. జయ సింహుడి ఆస్థాన చిత్రకారుడు చనిపోయా డనీ, అతనికి బదులు ఇంకెవరినీ వేసుకో లేదనీ హేమచంద్రుడికి తెలిసింది. తనకు ఉద్యోగం దొరుకుతుందేమోనన్న ఆశతో తన కంచరగాడిదపై మూడు రోజులు, ఎడారి వెంబడి, తిండికూడా లేకుండా ప్రయాణంచేసి, ఆకలితో మాడిపోతూ జయ సింహుడి కోటకు చేరుకున్నాడు.

రాజభటులు మొదట హేమచంద్రుణ్ణి అంతఃపురంలోకి వెళ్ళనివ్వ లేదు. "నేను చిత్రకారుణ్ణి. రాజుగారికి చూపటానికి బొమ్మలు తెచ్చాను," అన్న తరవాత వాళ్లు అతన్ని లోపలికి వెళ్లనిచ్చారు.

హేమచంద్రుడు రాజుగారి దర్శనం చేసు కుని, "నిద్రాహారాలు లేకుండా ప్రయాణం చేసి ఎంతో దూరం నుంచి తమరిని చూడ వచ్చాను. ఇవి నేను వేసిన బొమ్మలు. వాటిని చూస్తే నా శక్తి తమకే తెలుస్తుంది," అన్నాడు.

ఆ బొమ్మలను చూసి రాజుగారు చాలా సంతోషించాడు. ఇటువంటి శక్తిగల గొప్ప చిత్రకారుడు దూరదేశం నుంచి పొట్టచేత పట్టుకుని ఇంతదూరం ఎందుకు రావలిసి వచ్చిందో జయసింహుడికి అర్థం కాలేదు.

రాజస్థాన్ జానపద కథ

"ఈ బొమ్మలు నాకు చాలా బాగున్నాయి. వీటికి ఏమి ఇవ్వమన్నావు?" అని జయసింహుడు హేమచంద్రుణ్ణి అడిగాడు.

"ఆకలి గొని ఉన్నాను. ముందు నాకు భోజనం పెట్టించండి. ఆ తరవాత, తమ ఆస్థానంలో ఒక ఆసనం ఖాళీగా ఉన్నదని విన్నాను, దానిపైన నన్ను కూచుంటూ ఉండనివ్వండి. అదే నాకు పదివేలు!" అన్నాడు హేమచంద్రుడు.

రాజు సరేనని తన భటులను పిలిచి హేమచంద్రుణ్ణి భోజనశాలకు పంపాడు. హేమచంద్రుడు కడుపు నిండా తిన్నాడు. అతని కంచరగాడిదను రాజుగారి గుర్రాల సాలలో కట్టివేశారు. మర్నాటినుంచి హేమచంద్రుడు దర్బారులో ఆస్థాన చిత్రకారుడి ఆసనం పైన కూచోసాగాడు.

ఇప్పుడు తిరిగి ఆస్థాన చిత్రకారుడు ఏర్పడ్డాడు గనక, అతనిచేత తన చిత్తరువు వేయించు కుందామని జయసింహుడికి ఆలోచన కలిగింది. ఆయన హేమచంద్రుడితో, "దివాణంలో మా పూర్వీకులందరి చిత్తరువులూ ఉన్నాయి. నా చిత్తరువుకూడా తయారుచేసి, రాబోయే తరాలవారు నా ఆకారంచూసే అవకాశం కలిగించు!" అన్నాడు.

"తమ ఒక్కరి చిత్తరువే ఏమిటి, మహారాజా! సింహాసనాల మీద తమరినీ, రాణీ గారినీ ఉంచి, తమ మంత్రులనూ, సేనానాయకులనూ, అందరినీ చిత్రిస్తాను. దివాణంలో మంచి గోడ ఒకటి చూపించండి. మిలిగినదంతా నేను చూసుకుంటాను," అన్నాడు హేమచంద్రుడు.



రాజు పరమానందం చెందాడు. రాజసభ యావత్తూ చిత్రించటానికి హేమచంద్రుడికి అనుమతి ఇచ్చాడు.

రాజుగారి ఆస్థానంలో పెద్దపెద్ద పొట్టల వాళ్ళున్నారు, ఒక గూనివాడున్నాడు, ఒక ఒంటి కన్నువాడూ, మెల్లకళ్లవాళ్ళూ కూడా ఉన్నారు. వారు ఒక్కొక్కరే హేమచంద్రుడి వద్దకు వచ్చి, "నన్ను చిత్రించేటప్పుడు గూని లేకుండా చిత్రించు. రెండు కళ్ళూ ఉన్నట్టు చిత్రించు. మెల్లకన్ను వెయ్యకు!" అని హెచ్చరించారు; లేకపోతే చావగొట్టిస్తా



ముగ్గురు సహాయకులను తీసుకుని, వారితో తింటూ, హేమచంద్రుడు వినోదాలతో కాలక్షేపం చేయసాగాడు.

ఒక నెల గడిచింది. రాజుగారు హేమచంద్రుణ్ణి పిలిపించి, చిత్తరువు ఎంతవరకు వచ్చిందని అడిగాడు. "మహారాజా, పని చేస్తున్నాను. త్వరలోనే అయిపోతుంది," అన్నాడు హేమచంద్రుడు.

ఆ తరవాత వారానికొకసారి రాజుగారు చిత్తరువు గురించి అడగటమూ, దానికి హేమచంద్రుడు, "మహారాజా,ఇంకా కొద్దిగా పని మిగిలి ఉన్నది!" అని జవాబు చెపుతూండటమూ జరిగింది.

ఈ విధంగా మూడు మాసాలు గడిచాయి. అప్పటికీ చిత్తరువు పూర్తికాక పోయేసరికి రాజుగారికి కోపం వచ్చింది. ఆయన హేమచంద్రుడితో, "ఇంకొక్క వారంలోపుగా చిత్తరువు పూర్తికాకపోతే నిన్ను కఠినంగా శిక్షిస్తాను!" అన్నాడు.

దానికి హేమచంద్రుడు, "చిత్తరువు పూర్తి అయింది, మహారాజా! రేపు మంచిరోజు. పరివారంతోసహా దయచేశారంటే చిత్తరువు ఆవిష్కరణ చేయవచ్చు!" అన్నాడు.

రాజు సంతోషించి ఈ వార్త సభికులందరికీ తెలియబరిచాడు.

మర్నాడు రాజూ, రాణీ, ఇతర రాజోద్యోగులూ చిత్తరువు చూడటానికి వచ్చారు. గోడకింకా తెర అడ్డం కట్టి ఉన్నది.

మనీ, చంపిస్తామనీ వాళ్ళు హేమచంద్రుణ్ణి బాగా భయపెట్టారు.

ఈ సంగతి రాజుగారికి చూచాయగా తెలియవచ్చింది. ఆయన హేమచంద్రుణ్ణి పిలిచి, "ఆస్థానంలో ప్రతి ఒక్కణ్ణీ యథార్థంగా చిత్రించక ఏమైనామార్పులు చేశావో, నిన్ను ఉరితీయిస్తాను! జ్ఞాపకం ఉంచుకో!" అని హెచ్చరించాడు.

హేమచంద్రుడికి ముందు నుయ్యీ, వెనక గొయ్యీ అన్నట్టయింది. ఏమి చేసినా చావు తప్పేటట్టులేదు. అతను దీర్ఘంగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు.

చిత్తరువు వేయటానికి ఒక గోడ ప్రత్యేకించ బడింది. దానికి ఒక తెర అడ్డంకట్టి,

చిత్తరువు చూడవచ్చిన వారితో హేమ చంద్రుడు, "మిమ్మల్నందరినీ చిత్రించాను. ఎవరి బొమ్మను వారు జాగ్రత్తగా పోల్చు కోండి. కాని ముందుగా ఒక్క మాట మనవి చేసుకుంటున్నాను. తమలో గొప్ప పుటక పుట్టిన వారికి మాత్రమే నా చిత్తరువు కనిపి స్తుంది; లేనివారికి ఏమీ కనిపించదు!" అంటూ, తెర లాగేశాడు.

గోడమీద ఏ బొమ్మా లేదు. కాని ఆ మాట పైకి అనటానికి రాజుగారు మొదలు కొని ప్రతివాడూ జంకాడు. ఎవరిమటుకు వారు, తమకు తప్ప మిగిలిన అందరికీ, చిత్తరువు కనిపిస్తున్నదని అపోహపడ్డారు.

రాజుగారి వెంట ఉండే హాస్యగాడు మటుకు, "నాది ఎంత పాడుపుటకో గాని, నాకు వట్టి గోడే కనిపిస్తున్నది! దానిమీద బొమ్మే లేదు!" అన్నాడు.

మిగిలినవాళ్ళు కూడా, "మాకూ బొమ్మ కనిపించటం లేదు," అని బయటపడ్డారు.

హేమచంద్రుడు అందరి కళ్లలోనూ దుమ్ముచల్లటానికి ప్రయత్నించినట్టు రూఢి అయిపోయింది. రాజుగారు ఆగ్రహంతో పళ్ళు పటపట కొరుకుతూ, "నీచుడా, ఇంతమందినీ వంచన చేస్తావా? నిన్ను ఉరి తీయించినా పాపం లేదు!" అన్నాడు.

హేమచంద్రుడు చేతులు జోడించి, "చిత్తం, మహారాజా! నన్ను ఉరి తీయిం చండి! నేను ప్రాణాలతో బయటపడతానని కలలో కూడా అనుకోలేదు. కాని, దయ ఉంచి నన్ను బంగారుతాడుతో మాత్రం ఉరితీయించకండి! ఎందుకంటే లక్ష్మికి నా మీద బొత్తిగా కటాక్షం లేదు. నన్ను ఉరితీసే సమయానికి బంగారు తాడు దానంతట అదే తునకలుగా తునిగిపోవచ్చు!" అన్నాడు ఎంతో వినయంగా.

ఈ మాట వినగానే, అంత కోపంలోనూ రాజుకు నవ్వొచ్చింది. హేమచంద్రుడు ఎంత గొప్ప చిత్రకారుడైనా రాజుల ఆస్థానాలలో ఉండటానికి పనికిరాడని ఆయనకు తెలిసి పోయింది. ఆయన హేమచంద్రుడికి కొంత బంగారం ఇచ్చాడు. హేమచంద్రుడు కంచర గాడిద మీద వచ్చిన దారి పట్టాడు.



# చందమామ కబుర్లు



## 'శుక్రగ్రహంలో జలం!'

అమెరికాలోని, 'నాసా అమ్స్ రిసర్చ్ సెంటర్' నుంచి అంతరిక్షంలోకి పంపిన 'పయొనీర్ - 12' అనే శాటలైట్, శుక్రగ్రహం గురించి అనేక విషయాలను సేకరించి పంపి, గత అక్టోబర్‌లో చెల్లాచెదరై పోయింది. ఆ శాటలైట్ పంపిన విషయాలనుబట్టి చూస్తే దాదాపు 3 లక్షల కోట్ల సంవత్సరాలకు పూర్వం శుక్రగ్రహంలో మహా సముద్రాలకు సరిపడే నీళ్ళు ఉండేవనీ, కాబట్టి ఆ కాలఘట్టంలో అక్కడ జీవరాశులు కూడా ఉండి ఉండవచ్చుననీ శాస్త్రవేత్తలు అభిప్రాయ పడుతున్నారు!

## కళ్ళద్దాలమీద టీవీలు!

ఇళ్ళల్లో ఉండే మామూలు టీవీలే కాకుండా, ఇటీవల మనం వెళ్ళే చోటికల్లా తీసుకువెళ్ళ డానికి అనువుగా ఉన్న 'పోర్టబుల్ టీవీలు' కూడా ఎక్కువవుతున్నాయి. ఇవి బ్యాటరీల శక్తితో పని చేస్తాయి. మోటారు కారులలో అమర్చడానికి వీలుగా బుల్లి టీవీలు కూడా వచ్చాయి. ఇప్పుడు హంగరీ ఇంజనీర్లు ఇద్దరు కలిసి కళ్ళద్దాల ఫ్రేము లలో ఇమిడేంత అతి చిన్న టీవీలను రూపొందిం చారు. రెండు అద్దాల సాయంతో 'లెన్స్' లోని బొమ్మలను చూడడానికి సాధ్యమవుతుంది.

## 'ఇన్‌స్టంట్ ఫోటోగ్రాఫ్'

వార్తాపత్రికల తరఫున వెళ్ళే ఫోటోగ్రాఫర్లు, ఫోటోలు తీసి 'డెవలప్' చేసి ప్రింటులను పంప వలసిన అవసరం లేకుండా- ఎంతదూరంలో ఉన్నప్పటికీ తీసిన ఫోటోలను వెంటనే పత్రికా కార్యాలయాలకు చేరవేసే అద్భుతమైన సదు పాయం ఇవాళ ఉన్నది. శాటలైట్- సాంకేతిక పరిజ్ఞానం ద్వారా ఇది సాధ్యమవుతున్నది. కెమెరా వెనక అమర్చే 'ఎలక్ట్రానిక్' పరికరానికీ, దాని నుంచి 'రేడియో టెలిఫోన్'కూ, అక్కడి నుంచి శాటలైట్‌కూ 'లింకు' ఉంటుంది. ఈ ఏర్పాటు ద్వారా కెమెరాలోని బొమ్మను శాటలైట్ ద్వారా 'సెంట్రల్ కంప్యూటర్'కు పంపడం జరుగుతుంది. సెంట్రల్ కంప్యూటర్ ఆ బొమ్మను రిసీవ్ చేసుకుని పంపవలసిన చోటికి క్షణంలో చేరవేస్తుంది.



# న్యాయసూత్రం

కొన్నివేల సంవత్సరాలకు పూర్వం ధర్మ పాలుడనే రాజు ధవళగిరి రాజ్యాన్ని పరి పాలిస్తూండేవాడు. ఆయన దాన, ధర్మగుణా లలో సాటిలేని వాడనిపించుకున్నాడు. న్యాయనిర్ణయం చేయవలసి వచ్చినప్పుడు 'నావాడు, ఇతరుడు' అనే భేద భావం ధర్మపాలుడిలో కొంచెమైనా కానవచ్చేది కాదు.

కంటికి కన్ను, పంటికి పన్ను — అనేదే ఆయన ఆచరించే న్యాయసూత్రం. కీడు పొందిన వాడెవడైనా, తిరిగి అదే పద్ధతిలో కీడుచేసిన వాడిపై పగ తీర్చుకొనవచ్చు ననే న్యాయం ఆ రాజ్యంలో అమలులో ఉండేది.

ఒకనాడుధర్మపాలుడు నిండుకొలువులో వున్నాడు. మంత్రి, సామంతులంతా ఎదుట సుఖాసీనులైవున్నారు.రాజ్యపాలనకుసంబం ధించిన ముఖ్యవిషయాలపై తీవ్రమైన చర్చ జరుగుతూ వుంది. ఆ సమయంలో ఒక నాగుపాము దారి తప్పి వచ్చి కొలువులో ప్రవేశించింది.

నాగుపాము కంటపడే సరికి కొలువులో కలకలం బయలుదేరింది. కొందరు కత్తులు దూసి దానిని చంపేందుకు లేచి నిలబడ్డారు. కాని తండ్రి పక్కనే కూర్చుని వున్న యువరాజు అందరినీ వారించి, తన ఖడ్గంతో నాగుపామును రెండు తుండె ములుగా నరికాడు.

అలా నరికినప్పటికీ, తలవున్న మొండె ముతో నాగుపాము అక్కడి నుంచి ఎలాగో తప్పించుకుని పారిపోయి అతికష్టంమీద పుట్ట చేరింది.

నాగుభార్య, భర్తకు కలిగిన ఈ విపత్తు చూసి శోకించసాగింది. అప్పుడు నాగు తను దారి తప్పి కొలువులోకి వెళ్తే, తనకు యువ రాజు చేసిన అపకారం గురించి తెలియ



పరిచి, "ఈ రాజ్యంలోని కట్టడ నీకు తెలుసు గదా? ఆ ప్రకారమే రాజు న్యాయ విచారణ చేసి పుత్రుడికి శిక్ష విధిస్తాడు. ఆ కట్టడివల్ల నేరస్థుడైన యువరాజును నువ్వు కరిచి చంపవచ్చును. ముందుగా రాజుకు మాత్రం న్యాయవిచారణ జరిపే అవకాశం ఇవ్వవలసింది. అంతేకాని అనవసరంగా తొందరపడి యువరాజుకు హాని కలిగించ వద్దు!"అని భార్యతోచెప్పి ప్రాణంవిడిచాడు.

నాగుభార్య ఆ రాత్రి రాజుగారి కోట ప్రవేశించి యువరాజు పడక గది చేరింది. గాఢనిద్రలో వున్న యువరాజు కంఠానికి క్షణంలో చుట్టుకుంది. యువరాజు మేలు కొని భయ కంపితుడై పోయి, సహాయం కోసం కేకలు పెట్టాడు. కేకలు విని దాస దాసీలందరూ అక్కడికి పరుగెత్తుకు వచ్చారు. కాని, ఎవ్వరికీ నాగు భార్యను చంపటం ఎలాగో తెలియలేదు. యువ రాజు కంఠాన్ని గట్టిగా చుట్టపెట్టుకొని వున్న ఆ పామును కొట్టాలంటే, యువరాజుకూ దెబ్బ తగులుతుంది. అలాంటి స్థితిలో ఏమి చేయటానికీ వాళ్లకు పాలుపోక కంగారు పడసాగారు.

అంతలో నాగు భార్య మానవభాషలో, "ముందు రాజుగారిని పిలుచుకు రండి, తక్షణం న్యాయవిచారణ జరగాలి. ఒకవేళ మీలో ఎవరైనా నన్ను చంప యత్నిస్తే యువరాజును కాటువేస్తాను, జాగ్రత్త!" అంటూ హెచ్చరించింది.

అంతలో రాజుగారు అక్కడకు రానే వచ్చారు. నాగు భార్య తన భర్త మరణాన్ని గురించి రాజుతో చెప్పి, "నా భర్త ఎవరికీ హాని తలపెట్ట లేదు. ఆయన దారి తప్పి రాజసభలోకి వచ్చాడు. ఆ మాత్రానికి యువరాజు అన్యాయంగాఆయనను చంపి నాకు వైధవ్యం కలిగించాడు. ఈ రాజ్యంలో అమలులో ఉన్న న్యాయసూత్రం ప్రకారం నేను యువరాజును చంపి, ఆయన భార్యకు వైధవ్యం కలిగించ వచ్చును గదా?" అన్నది దీనంగా.

నాగుభార్య అలా అనేసరికి రాజు చాలా వ్యాకులపడ్డాడు. న్యాయచట్టం ప్రకారం,

అన్యాయంగా నాగుపామును చంపివేసి ఈమెకు వైధవ్యం కలిగించిన యువరాజు శిక్షార్హుడే అవుతాడు. కాని తనకు అతడు ఒక్కగానొక్క కొడుకు! ఈ విపత్తునుంచి బయటపడటం ఎలా?

చేసేది ఏమీ లేక రాజు వెంటనే ఇరువురు న్యాయమూర్తులను పిలిపించాడు. వాళ్ళు నాగు భార్య చెప్పిన దంతా పూర్తిగా విన్నారు.

ఆ తరవాత ఒక న్యాయమూర్తి ఇలా చెప్పాడు: "మహారాజా! కంటికి కన్ను, పంటికి పన్ను—అన్న మన రాజ్య న్యాయ చట్టం అందరికీ తెలిసిందే. అది చాలా కాలంగా అమలులో ఉన్నది. కనుక, యువ రాజు వల్ల అపకారం పొందిన నాగుపాము, తన భార్యకు కలిగిన వైధవ్యబాధనే యువ రాణిగారికి కూడా కలిగించ వచ్చు!"

నాగుభార్య ఈ తీర్పు విని అనంగీకారంగా తల ఆడించింది.

"ఇది ఏ న్యాయశాస్త్రమూ అంగీకరించని తీర్పు. కేవలం నన్ను మోసపుచ్చటానికి, ఈ న్యాయమూర్తులవారు చేస్తున్న ప్రయత్నం. చచ్చిపోయిన నా భర్త ఏ విధంగా యువ రాజు భార్యకు వైధవ్యం కలిగించ గలడు?" అని అడిగింది.

నాగుభార్య అలా ప్రశ్నించే సరికి ఆ న్యాయమూర్తి మరి మాట్లాడలేక మౌనం వహించాడు.

అప్పుడు రెండవ న్యాయమూర్తి ఇలా అన్నాడు: "నాగు భార్య చెప్పిన దానిలో



సత్యం లేకపోలేదు. అయినా, ఇక్కడ ఒక ధర్మసందేహం కలుగుతూ వుంది," అంటూ "అమ్మా, నీకు సంతానం ఎందరు?" అని నాగుభార్యను అడిగాడు.

"నాకు ఐదుగురు పుత్రులు!" అన్నది నాగుభార్య కళ్ళనీళ్ళు పెట్టుకొని.

"అలాగా పాపం! యువరాజు నిన్ను ఐదుగురు పుత్రులు వున్న వితంతువుగా చేశాడన్నమాట! కనుక నువ్వు, ఆయన భార్యను ఐదుగురు పుత్రులున్న వితంతువుగానే చేయాలి! అప్పుడుగాని న్యాయ సూత్రాన్ని సక్రమంగా అనుసరించి శిక్ష విధించినట్టు కాదు, అవును గదా?" అని అడిగాడు.

అందుకునాగు భార్య, "అవును,అవును!" అన్నది అనుమానిస్తూ.

అప్పుడు న్యాయమూర్తి ఇలా చెప్పాడు : "కనుక, నువ్వు మరి కొంతకాలం వేచి వుండాలి. ఎందుకంటే ఇప్పుడు యువరాణికి ఇద్దరే పుత్రులు. ఆమె కూడా ఐదుగురు పుత్రుల తల్లి అయిన తరవాత, నువ్వు నిరభ్యంతరంగా యువరాజు మీద పగతీర్చుకోవచ్చు."

ఈ తీర్పు ఆ రాజ్యంలో కొనసాగుతూన్న న్యాయ సూత్రానికిఅనుగుణంగానే వుందని నాగుభార్య అంగీకరించక తప్ప లేదు. అందువల్ల ఆమె రాజుగారిని ఒక్క కోర్కె కోరింది. యువరాణికి ఐదవ సంతానం కలగగానే తనకు ఆ వర్తమానం పంపమన్నది.

న్యాయశీలి అయిన రాజు ఆమె కోరికకు సరే అన్నాడు.

అయితే, యువరాణికి ఆ తరవాత సంతానమే కలగలేదు.

నాగుభార్య మాత్రం, ఆ దంపతులు ఉద్యానవనంలోకి వచ్చినప్పుడల్లా తన పుట్టలోనుంచి ఆశతో తల పైకెత్తి చూసేది. ఎంతకాలం జరిగినా, వాళ్లవెంట ఇద్దరు పిల్లలు కంటే ఎక్కువ కనపడలేదు. ఇక నా పగ తీరటం ఎలా? అనుకునేది నాగుభార్య. కొంతకాలానికి తన పగ తీరకుండానే నాగుభార్య మరణించింది.



## ప్రకృతి వింతలు:



హరిత పదార్థాలే కారణం.

### ఆకులలో పచ్చదనం

పచ్చిగడ్డీ, చెట్ల ఆకులూ పచ్చగా కనిపించడానికి వాటి లోని 'క్లోరోప్లాస్ట్' అనే హరిత పదార్థాలే కారణం. ఈ 'క్లోరోప్లాస్ట్'లో ఇంకా నాలుగు పదార్థాలున్నాయి. 'క్లోరోఫిల్' నీలి పచ్చరంగులోనూ, క్లోరోఫిల్ బి పసుపు ఆకు పచ్చగానూ, క్సాంటోఫిల్ పసుపు రంగులోనూ, 'కెరోటిన్' గులాబీ రంగులోనూ ఉంటాయి. గడ్డీ, ఆకులూ ఆయా రుతువులకు అనుగుణంగా లేత ఆకుపచ్చ రంగు నుంచి, ముదురు ఆకుపచ్చ రంగుగా మారడానికి ఈ

### రంగులు మార్చే ఊసరవెల్లులు



శత్రువుల నుంచి తమను రక్షించుకోవడానికి జీవరాశులకు ప్రకృతి కొన్ని సదుపాయాలను సమకూర్చి ఉన్నది. పరిసరాలకు తగ్గ విధంగా జంతువులు తమ రంగును మార్చుకునే శక్తి వీటిలో ప్రధానమైనది. అటువంటి శక్తి గల జంతువులలో, ముఖ్యమైనది ఊసరవెల్లి. వీటి చర్మంలో 'క్రోమెటోఫోర్స్' అనే రంగులు మార్చే ప్రత్యేక కణాలు ఉన్నాయి. మామూలుగా ఇవి ఒకే రంగులో చిన్న నక్షత్ర ఆకారంలో ఉంటాయి. ఊసరవెల్లులలో ఈ కణాలు వివిధవర్ణాలలో ఉంటాయి. ఒక రంగు కణం మరొకరంగుకణంతో కలిసేప్పుడు వేరొక కొత్త రంగు పుట్టుకొస్తుంది. ఉదాహరణకు నీలం—పసుపూ కలిసి ఆకుపచ్చ రంగూ; ఎరుపూ—పసుపూ కలిసి గులాబీ రంగూ; ఎరుపూ—నీలం కలిసి ఊదా రంగూ ఏర్పడతాయి!



### సిందూర వర్ణం కొంగలు

కాకుల్లాగా శరీరమంతా ఒకేరంగుతో ఉండే పక్షులు చాలా తక్కువగాఉంటాయి. అటువంటి వాటిలో ట్రినిడాడ్‌లోని సిందూర వర్ణం కొంగలు ముఖ్యమైనవి. ఇవి అద్భుతమైన జాతికి చెందిన చాలా అందమైన పక్షులు. ఆరుకోట్ల సంవత్సరాలకు పూర్వం నాటి వీటి శిలాజాలు లభించాయి. మానవజాతి చరిత్రను రాయడానికి దేవుడు ఈ పక్షులను నియోగించినట్లు ప్రాచీన ఈజిప్షు ప్రజలు నమ్మి గౌరవించేవారు. ఇవి పుట్టేప్పుడు ఊదా రంగుతో ఉంటాయి. తరవాత బూడిద రంగు గానూ, తెల్లగానూ, గులాబీ రంగుగానూ మారి ఆఖరికి పెరిగి పెద్దయ్యేసరికి సిందూర వర్ణం సంతరించు కుంటాయి.

# and all the rest
# e the very best
# YOU from today
# ama's 3rd B'day



Thanks to all of you. From all of us here at Chandamamma. Thanks for having shared all those happy times with us. And we hope you have many more.

Thanks to all you Moms, Dads, Grandmoms and Grandads too. For giving us homes with such great friends. And all that warmth and affection.

Thanks to all our distributors and dealers. For all the help and support. Here's to even better times ahead !

This is just the beginning. Watch out for the surprises we have in store for you next year. Like the new range of Chandamama Soft Tbys. And much more ! Because, at Chandamama, the party goes on all year through !

THE
CHANDAMAMA
COLLECTION

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1993 జూలై నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



Devdas Kasbekar

* పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * మే నెల 15వ తేదిలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. * మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. * వ్యాఖ్యలు రెండూ పోస్టు కార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి :- చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026.

---

## మార్చ్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : లేదు నీకిక భయం!

రెండవ ఫోటో : ఇస్తున్నా చూడు అభయం!

పంపినవారు : పి.యం. సుందరరావు, లైబ్రరీ అసిస్టెంట్, ఆంధ్ర లయోలా కాలేజీ, విజయవాడ - 520 008. (ఆం.ప్ర.)

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 48.00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026

**Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.**

దూరతీరాలలో ఉన్న మీ బంధుమిత్రులకు
మీరు ఇవ్వదగిన ప్రియాతి ప్రియమైన కానుక

# చందమామ



వారికి కావలసిన భాషలో చందమామను అందజేయండి:

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీష్, గుజరాతీ, హిందీ, కన్నడం, మలయాళం,
మరాఠీ, ఒరియా, సంస్కృతం, తమిళం, తెలుగు.

దూరదేశంలో ఉన్నప్పటికీ వారికి మాతృదేశంలో ఉన్న మధురానుభూతిని కలిగించండి!

**సంవత్సర చందా:**

ఆస్ట్రేలియా, జపాన్, మలేషియా & శ్రీలంక

సీ మెయిల్ ద్వారా: రూ. 105.00 ఎయిర్ మెయిల్ ద్వారా: రూ. 252.00

ఫ్రాన్స్, సింగపూర్, ఇంగ్లండు, అమెరికా,
పశ్చిమజర్మనీ & ఇతర దేశాలు

సీ మెయిల్ ద్వారా: రూ. 111.00 ఎయిర్ మెయిల్ ద్వారా: 252.00

మీ చందాలను 'చందమామ పబ్లికేషన్స్' పేరు మీదుగా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గాని,
మనిఆర్డర్ ద్వారా గాని కింది చిరునామాకు పంపండి:
సర్క్యులేషన్ మేనేజర్, చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600026